# శ్రీ ర హ్యా త్

రసాత్మకమైన వాక్యం కావ్యము. కావ్యములలో నాటకము రమ్యం. నాటకాలలో శకుంతల (రమ్యం) అని సహృదయ సూక్తి కలదు. అట్లే ఉత్తరేరామచరితే భవభూతిర్విశిష్యతే అనికూడా ఒకటిఉన్నది. అంటే - నాటకము లన్నిటిలో శకుంతల రమ్యమైనది - ఉత్తర రామ చరిత నాటకముచే భవభూతి విశిష్టుడైనాడు - అనేభావము భాసిస్తుంది. 'రమ్యవిశిష్ట' శబ్దాలు సాభిప్రాయములగును.

పరిశీలిస్తే ఈమహాకవుల కావ్య దృక్పథము భిన్న భిన్న మని తోచకపోదు. వారి రచనా సంవిధానము వేఱువేఱుగానే స్ఫురిస్తుంది. వారికంఠములు కూడా ఒకటికావు. అంతేకాదు. కాళిదాసు దృశ్యశ్రవ్య కావ్యాలు సృజించిన మహాకవి. భవభూతి కేవలం రూపకరచన సలిపిన శబ్దబ్రహ్మవిదుడు. అయితే మధుమయభణితికి మార్గదర్శకమైన మహర్షి రచనను ఇరువురును ఆరాధించిరి. కాని ఒకరు రామాయణమును రఘువంశ మహాకావ్యంగా కమనీయము చేయగా. ఇంకొకరు లోకోత్తర మయిన ఆవర్తనమును అభినయ విన్యస్తం కావించిరి.

వీరు రచించిన నాటకాలను తావిష్లవేయడంకూడా కఠినమైన కార్యం. ఎందుకంటే ఏకపత్నీ నిష్ఠంగా నిర్వాహకమైన రూపక ఇతివృత్తము చాల తక్కువ. అట్టి అనన్య సంవిధానము ఉత్తరరామచరితలోనే ఉన్మీలిత మయింది. అదిగాక, కరుణమనే ఒకానొక అద్భుత మానవభావము ఇందుస్థాయినంది రసముగా విలక్షితమైనది. బాగా ఆలోచిస్తే రామునివంటి నాయకుని పరికల్పింప వచ్చునేమో; కాని సీతాదేవి స్వభావ ధర్మశీలములు నాటకాభినయముగా అనుకృతములు కాగలవా అని సంశయము. భవభూతి దుర్ఘటమయిన ఈ సంవిధానమును సాధించాడు.

ఈ మహాకవి వైశిష్ట్యమును గురించి పూర్వుల ప్రశంస చదువరులకు అపేక్ష్యము కాకపోదు.

భవభూతేః సంబంధా ద్భూధర భూరేవ భారతీ భాతి,
ఏతత్కృత కారుణ్యే కిమన్యథా రోదితి గ్రావా

--- గోవర్ధనాచార్యుడు.

భవభూతేః శిఖరిణీ నిరర్గళ తరంగిణీ
రుచిరా ఘనసందర్భే యా మయూరీవ నృత్యతి

-- క్షేమేంద్రుడు.

స్పష్టభావ రసాచిత్రైః పదన్యాసైః ప్రవర్తితా
నాటకేషు నటస్త్రీవ భారతీ భవభూతినా.

—— ధనపాలుని - మంజరి.

ఈ నాటకమును పలువురు విద్వత్కవులు ఇదివరకే తెనిగించిరి- ఇప్పుడు పునః అనువాదమెందుకని సహృదయులును, స్నేహితులును ప్రశ్నింపకపోరు. నచ్చే సమాధానమేమీ నాకు కనబడలేదు

అనువాదములో ఛందస్సంబంధములైన మార్పులుకొన్ని కానవగును. మూలములోని వృత్తములను యథాగణబద్ధంగా అక్కడక్కడ అనుఘటించితిని. యతిప్రాసలు పాటింపలేదు. ఇంకా, గతిగమకములు సరళములగునని తోస్తే ఒకవర్ణమును-లఘువునో-గురువునో-కలిపితిని. వసంత తిలక పాదాంతమున రెండు గురువులలో చివరది లఘువైనను కలుగదా — అట్లునిలిచిన గురులఘువులను నడకనుబట్టి మూడు మాత్రలుగా వాడుకొంటిని. కోమలామంత్రణమందు నాటక కవుల కలవాటైన 'అయి' తెచ్చుకొంటిని.

దేశిబంధమునందు ఆటవెలదిని సమపాదిగా సవరించితిని. సూర్య గణములను యథాతథంగా ఉంచి—మిగిలిన వానిని పంచమాత్రా ప్రాయంగా సవరించు కొంటిని. కొన్ని సీసములలో పాదగణములన్నీ పంచ

మాత్రాపరిమితములుగా కాననువు. మూలము ముగిసినప్పుడు నాలుగు చరణముల వాడుక వదలవలసి వచ్చినది. చంపకాదుల సంప్రదాయ ములు యథాతథంగా అనుసరించితిని.

ఈరచన 3-7-1958 తేదీన ప్రారంభమై 27-10-58 సాయంసమయాన ముగిసింది. నాకు చిన్నప్పటినుంచీ వ్రాసినది ఇతరులకిచ్చి వారు చదివితే వినే అలవాటు. ఆసందర్భములోనే రచనలో జరుగవలసిన పరిష్కారమంతా కుదిరేదినాకు. ఆ సహకారం అందించారు ఆసక్తితో - ఆవేశంతో శ్రీ ముట్నూరి సంగమేశంగారు. ఆయన మూడు భాషలలోని అందచందాలు తెలిసిన భావుకుడు. తరువాత శ్రీ పంగనామాల బాలకృష్ణ మూర్తి గారి సాహచర్యం కలిగింది. అనువాదమంతా చదివారు. తారతమ్యాలు చర్చించారు. విపదా విశదములు సవరించారు. ముద్రణ పూర్తిగావించారు. ఆయన ఉభయ భాషలయందును బోధలో — పరిశోధనలో కుశలుడైన విచక్షణుడు. వారికి ఇరువురకును నాకృతజ్ఞత.

తిరుపతి.
17—4—1959

రాయప్రోలు సుబ్బారావు.

శ్రీ రస్తు.

# ఉత్తరరామచరిత

ఇదియె నమోవాకము పూ
ర్వకవులకు పురాతనులకు—ఋషులకు: ఆత్మకళా
మూర్తి - అమృత - యగు వాచా
దేవత మమనుగ్రహప్రతీతి నటింపన్.

[నాందికి అనంతరము సూత్రధారుడు ప్రవేశించి]

ధారుడు — అతిప్రసంగ మక్కరలేదు. ఇప్పుడు భగవంతుడగు కాలప్రియానాథుని తిరునాళ్ళలో ఇచటికి విచ్చేసిన విద్వాంసులకు ఇట్లు విన్నవించుకొనుచున్నాను. పూజ్యులు మీరు చిత్తగింపుడు. ఉన్నాడు కదా! కాశ్యపగోత్రుడు — శ్రీకంఠుడను బిరుదు కలవాడు. వ్యాకరణ తర్కమీమాంసా శాస్త్రముల తత్త్వ మెఱిగినవాడు — భవభూతి — జాతూకర్ణీపుత్రుడు.

ఎవ్వనికి బ్రాహ్మణుని బోలె నిష్టవశ్య
యై సహచరించు దేవి వాక్పవిత్రి,
ఆ మహాకవి యుత్తరరామచరిత
మభినయింపగ నున్నార మధికముగ.

ఆ కార్యార్థమై నేను అయోధ్యావాసినైన రామసభాకీర్తనుడనైతిని.

(అంతటను కలయ చూచి)

రావణ కులధూమకేతువైన రామచంద్రుని మహారాజ్యాభిషేక సమయము గదా ఇది. రాత్రిం దివసములు ఇంత ఎడతెరిపిలేక మోగు

మండెను అసంఖ్య మంగళ వాద్యములు — ఏమిది ! ఆ చారణులందఱూ ఇప్పుడు వావిళ్ళయుంగిళ్ళలో తూగుచున్నారు.

[ నటుడు ప్రవేశించి ]

నటు : ఆర్యా ! సంగ్రామ సమయమున సహాయపడిన వానర రాక్షస ప్రముఖులకు అంపకములయినవి. నానా దిగంతములనుండి అభిషేక సభకు వేంచేసిన పవిత్రులను — అగస్త్యాది బ్రహ్మర్షులను, నారదాది దేవర్షులను ఆరాధించుటకై ఇన్ని దినములును ఉత్సవము సాగవలసినది. ఇప్పుడు

ఇల వసిష్ఠుడు బ్రహ్మర్షి ఋషిగణముల
పుణ్యగంధి అరుంధతి ముందు నడువ
వెళ్ళినారు రాముని మాతృజనులంత
అల్లునాశ్రమమునకు యజ్ఞార్థముగను.

సూత్ర : అలాగా ! నటుడా ! అనుకున్నాను నేను వైదేశికుడను. వీరికి అల్లుడెవరు ?

నటు : దశరథవిభుండు కన్నె శాంతమను సంతు
వేని రోమపాదునకు పాలింప నిచ్చె ;
పరిణయంబాడె నామెను విభాండకఋషి
సుతుడు ఋష్యశృంగుండు విశ్రుత తపస్వి.

ఆయన ఇప్పుడు పన్నెండేండ్ల సత్రయాగమును ఆరంభించెను. తప్పరాని విధాయకమగుటచే పెద్దవారందఱును కఠోర గర్భాలసయైనను కోడలిని విడిచిపెట్టి అక్కడికి వెళ్ళినారు.

సూత్ర : అది అంతా మన కెందుకులే ! రాజద్వారమును సమీపించి కులవృత్తి ప్రకారము సమయానుకూలముగా సేవింతము.

నటి : అలా గయితే, నాథా ! ముందుగా రాజస్వాగతికి ముదావహ
మయిన పాత్రపద్ధతిని చెప్పి నిశ్చయింపుము.

సూత్ర: పాడవలె సర్వథా పరిపాటికొలది,
తప్పిదములు కంపని సువృత్తముగా కాదె !
పడతులం దెల్ల పతిసేవకతల నెల్లి-
వర్తనము సుమిత్ర జనయ సాధ్వీగణాన.

నటి : నిజమే — అత్యంత దుర్గమములని చెప్పతగును.
పట్టపుదేవి యని తలంపక విదేహ
పుత్రి వనవాస కష్టి పాటొప్ప పౌర
జనము - రాక్షస గృహనివాసంబు వలన —
అగ్నిపద్ధివల్లను నిశ్చయంబు లేక.

సూత్ర : ఆహా ! ఈ లోకాపవాదము మహారాజు చెవిసోకెనా ! కష్టము
తప్పదు.

నటి : సర్వథా, దేవతలును ఋషులును శుభమును సమకూర్పగలరు.
(పరిక్రమించి) ఓహో ! ఎవరక్కడ ! ఇప్పుడు మహారాజుగా
రెక్కడ ఉన్నారు ? (వినుట నభినయించి)

స్నేహమున ఇన్నినాళ్ళు రంజింపజేసి
జనకు డరిగె విదేహ కుత్సవము విడిచి;
దాన కలగిన దేవి సౌదార్య విధము
వాస గృహమేగె విడిచి ధర్మాసనమును.

(సూత్రధార నటులు నిష్క్రమింతురు.)

ప్రస్తావన

# ప్రథమాంకము

[ఆసీనులై సీతారాములు ప్రవేశము]

రాముడు: దేవీ! వైదేహీ! గురుజనులు మనలను కావలెనని విడిచిపెట్టి వెళ్ళగలరా? మరేమన.

నిత్యమయిన అనుష్ఠాన నియతి గాని
ఇచ్చవచ్చినంత స్వతంత్రము గాదెపుడు-
అగ్నిహోత్రములకు విఘ్నమంటినచో గృ
హస్థధర్మము దోషోపహతిని చెందును.

సీత: అది నే నెఱుగుదును; ఐనను, ఆర్యపుత్రా! బంధుజనము విడిచి పెట్టి పోయినప్పుడు సంతాపము కలుగకపోదు.

రాము: అది యట్టిదే. హృదయమర్మస్థానములను ఛేదించు సంసార తాపములు ఇవే. అందువలనే బహుదుఃఖభాజనములగు ఇట్టి కామితముల నన్నిటిని త్యజించి మునీశులు అడవులలో విశ్రమింతురు.

[కంచుకి ప్రవేశము]

కంచు: రామభద్రా! (సగము పలికి ఆగి) మహారాజా!

రాము: (చిఱునవ్వుతో) ఆర్యా! మా పితృసేవకులు నన్ను రామభద్రా యని ప్రియముగా పిలుచుటయే శోభాయమానము. అందువలన అలవాటునే అనుసరింపుము.

కంచుకి: ఋష్యశృంగాశ్రమమునుండి అష్టావక్రుడు దయచేసినాడు.

సీత: ఆలస్యమెందుకు? .... ....

రాము: శీఘ్రమే వారిని ప్రవేశపెట్టుము.

[కంచుకి నిష్క్రమించును.]

అష్టా : ( ప్రవేశించి ) శుభమస్తు మీకు.

రాము : ఇదె తపసకు అభివాదము.

సీత : వందే. గురుజనుల కందఱికినీ, పెద్దలకును, మా శాంతమ్మకును కుశలమే కదా ?

రాము : మా బావ, ఋష్యశృంగ పూజ్యపాదులును, ఆర్యశాంతయును నిర్విఘ్నముగా సోమరసమును సేవింతురు గదా !

సీత : మమ్ములను ఎప్పుడైన స్మరింతురా !

అష్టా : ( కూర్చుండి ) అలాగే దేవి, భగవాన్ వశిష్ఠుడు నీతో ఇట్లు చెప్పుమనెను.

భగవతి మహీమతల్లికి పట్టి వీవు
తండ్రి, రాజర్షి జనకుడు, ధాతృసముడు,
ఎవ్వరికి కులగురువుల మినుడు నేను,
ఆ నృపుల యింటికోడల వయితి బిడ్డ !

ఇంతకన్న నిన్ను ఏమి దీవింపగలము. ఏదైక వీరులగు పుత్రులను కనుము.

రామ : అనుగ్రహింపబడితిమి.

జగతిలోన లౌకికులైన సాధుజనుల
వాక్కులు మెలంగు అర్థానువర్తనముగ ;
ఆద్యులయిన మహర్షుల యమృతవాగి
నంటి అర్థమే పఱుగిడు నపశ మగుచు.

అష్టా: భగవతి అరుంధతియు, దేవి శాంతయు మీకు మరీ మరీ చెప్పు మని ఇట్లు సందేశించిరి. "గర్భిణీసహజములైన వాంఛావిశేషములు ఏవయినా ఉన్నచో వానిని వెంటనే తీర్చవలసినది" అని.

రామ: ఈమె ఏమేని చెప్పినచో వానినెల్ల తీర్చెదను.

అష్టా: దేవీ! ఏ యామనవిష్టవల్లభుడు ఋష్యశృంగు డిట్లు చెప్పి పంపి నాడు. "వత్సా! పూర్ణగర్భవతి వగుటచే నిన్ను ఇచటికి తీసికొని రాలేదు. రామభద్రుని కూడ రప్పించక నీ వినోదమునకై అచట నిలిపితిమి. ఇక, ఆయుష్మతిని నిన్ను కొడుకున్న ఒడికట్టుతో చూడ కోరుచున్నాము."

రామ: (లజ్జాహర్షమందహాసములతో) తథాస్తు.

ఆర్యా, పూజ్యపాదులు వసిష్ఠులు నన్నేమియు ఆదేశింపలేదా?

అష్టా: వినుడు.

అల్లుని సవనమం దిటు లాగినాము.
బాలుడవు నీవు - క్రొత్త భూపాలనంబు,
రాజ్యకలన యుక్తము ప్రజారంజనంబు-
నదలిపేత యశంబె నీ ధనము రామ!

రామ: గురుదేవులు, మైత్రావరుణులు పలికినట్లే -
జాలినేని - స్నేహమునేని - సౌఖ్యమేని -
కావయేని - ఈ జనకపుత్రికన్యనేని -
అఖిలలోకసమారాధనార్థ మేను
వదలువాడ - లే దించుక వ్యథయు నాకు.

సీత: అందువలననే ఆర్యపుత్రుడు రఘుకులమును భరింప సమర్థుడైనాడు.

లక్ష్మ : ఇదే లిఖితమైన ఆ చిత్తరువు.

సీత : ( తెల్లబోయి ) వీ రెవరు ? సంజ్ఞ చేకుండా మీపైనే నిలబడి మిమ్ము స్తోత్రము చేయుచున్నట్లున్నారు.

లక్ష్మ: ఇవే, అతి రహస్యములయిన అజృంభకాస్త్రములు. వీనిని భగవాన్ భృశాశ్వుడు మహర్షి కౌశికునకు అనుగ్రహించెను. అవి విశ్వమునకు మిత్రుడయిన విశ్వామిత్రునికి సంక్రమించెను. ఆ మహానుభావుడు వానిని తాటకావధసమయమున ఆర్యున కుపదేశించెను.

రామ : దేవీ ! దివ్యాస్త్రము లివి. నమస్కరింపుము.

బ్రహ్మతోడ పురాణదేవతలు మున్ను
వేలవేలేండ్లు దీక్షించి వీని గనిరి;
స్వాత్మ తేజస్తపములు రూపములు గొనగ,
వేద సంరక్షణార్థమై విమలగాత్రి !

సీత : వీనికి నమస్కరించుచున్నాను.

రామ : ఇవి సర్వథా నీ సంతానమునందు సుస్థాపితము లగును.

సీత : అనుగృహీతను.

లక్ష్మ : ఇది మిథిలానగర కథ.

సీత : ఓహో ! ఏమి ! ఆర్యపుత్రుని శరీరసౌభాగ్యము ! పూచిన నల్లకలువ వలె నీలకోమలమై చిక్కగా నిగనిగలాడుచు సౌమ్యసుందరముగా నున్నది. సునాయాసముగా విఱిచిన శూలిధనుస్సుతో అచంచలమునైన నేత్రము లప్పగించి చూచుచున్నాడు. ముంగురులముడితో ముగ్ధమైన ముఖమండలము చక్కగా లిఖింపబడినది.

లక్ష్మ: తల్లీ ! చూడు చూడు.

పెండ్లిచుట్టాలకు వశిష్టపితరులకును
సముచితార్చనల్ సలుపు నీ జనకమౌళి;
తన కులపురోహితుడు గౌతమునిసుతు డ
యిన శతానందుతోడ ప్రహృష్టు డగుచు.

రాము: అది చూచుచున్నాను.

జనక రఘుకుల బాంధవ్యసంఘటనము
ప్రియము కాకుండు నెవరి కీ పృథివిమీద;
దాతయు ప్రతిగృహీతయు తాన యగుచు
కౌశికుడె నడిపించె మాంగల్యదీక్ష.

సీత: అలాగే ఉన్నది ఇది. ఆ సమయమున నాందీ గోదానము లిచ్చి వివాహదీక్షవహించిన ఆ నలుగు రన్నదమ్ములును వీరే. అహా! ఇప్పుడుకూడా నేను ఆ ప్రదేశమందే ఆ కాలమందే ఉన్నట్లు భావించుచున్నాను.

రాము: కమనీయ కంకణము కట్టినట్టి కరంబు
నర్పించె నాకై శతానందు డేవేశ,
అనుపట్టిలుచు నున్న దదియె యిప్పుడు సుముఖి!
నాపరిణయోత్సవము రూపొంది పెలసెనా.

లక్ష్మ: ఈమె పూజ్యురాల వయిన నీవే. ఇదిగో మాన్యురాలు మాండవి. ఇక, ఇది శ్రుతకీర్తి .... ....

సీత: వత్సా! (చిత్రములో ఊర్మిళను లక్షించి,) అవల నింకొకరున్నారు. ఆమె యెవరో?

లక్ష్మ: (అపవారించి, లజ్జించి, చిఱునవ్వుతో) అహా! దేవి ఊర్మిళను గురించి అడుగుచున్నది. కానిమ్ము. ముందుకు జరిపెదను.

రామ: (జనస్థానక - మహాశకటి చూపి) దేవీ ! వైదేహీ !

అసిహాదిక బేర్లు పయిన గుహుని
స్నిగ్ధసౌహార్దమొందు సంధిల్లె మనకు:
శృంగిబేర పురిజామునను ఇంగుదీమ
హీరుహం బిదె పేర్కొంపు మింపుపడిన.

లక్ష్మ: (నవ్వుతో-లోనలో) అన్నయ్య పలుకులలో నడిమితల్లి కైకేయి కథ అడుగున పడ్డదికే.

సీత: కటా ! ఇది జడలు ముడిచిన వృత్తాంతము.

లక్ష్మ: రాజ్యలక్ష్మిని పుత్రపరంబు జేసి,
వృద్ధులయిన ఇక్ష్వాకు లర్థించి రేద్ది.
బాల్యమందె పూనెను దాని భ్రాతృవరుడు
గజ్ఞమయిన పుణ్యారణ్యకవ్రతంబు.

సీత: ఇది నిర్మల పుణ్యతీర్థములతో నిండారిన భాగీరథీనది.

రామ: రఘుకులదేవతా ! నీకు నమస్కారము.

సవనాశ్వార్థము భూమి త్రవ్వి, కపిలేక్ష క్రోధకీలాహృతా
సువులై పడ్డ పితామహాల్ భగవతీ శుద్ధోదకస్పర్శచే
నవము పొందగ; స్వాంగపాత బహుంగా త్రిన్ సైచి, తోతెచ్చెనన్
స్తవనీయుండు భగీరథుం, డతి తపోజ్వాలాశిఖాశప్తుడై.

ఆ తల్లివి నీవు. కావున అరుంధతివలె - నీవును - ఈ కోడలిపట్ల మంగళ ధ్యానపై యేమరకుము.

లక్ష్మ: చిత్రకూటమునకు పోవు దారిలో యమున ఒడ్డున ఉన్న ఎని మహర్షి భరద్వాజుడు తెలిపిన శ్యామమను వనస్పతి — ఆ మహా వటము ఇదె.

రామ : (వానిపంక్తి పరికించి చూచును)

సీత : ఆర్యపుత్రా ! ఈ ప్రదేశము మీకు జ్ఞాపకమున్నదా !

రామ : ప్రియా ! దీనిని ఎట్లు మఱువగలుగుదును.

నడచిన మార్గఖేదమున నగ్గి, వ్యథాలసమోహనంబుచై,
వడిలిన తమ్మితూండ్లవలె వాడిన తావకదుర్బలాంగముల్
విడువని గాటపుం గవుగిలింతల నిచ్చి సపర్యచేయ నా
యెడదను వాల్చి మున్నిచట నే నిదురించితి వీవు కోమలీ !

లక్ష్మ : ఇచ్చటనే వింధ్యారణ్యము ప్రవేశించునపుడు మనలను రాక్షస విరాధుడు అడ్డగించెను.

సీత : ఇక చాలును. ఇప్పటికీ కథ ప్రత్యక్షముగా చూచుచున్నాను. ఆర్యపుత్రుడు స్వహస్తముతో తాటియాకుల గొడుగును బట్టి నాకు ఎండ తగులనీయని దక్షిణారణ్యప్రదేశము.

రామ: ఇవి వైఖానసు లాశ్రయించెడి తపోవృక్షాటవీనిర్ఝరీ
సవిధారణ్యతలంబు; లిం దతిథిదేవవ్రాత పూజాపరో
త్సవులై నిల్తురు గేస్తు - లాత్మశమనేచ్ఛాదీక్షితుల్ - సంభ్రమం
బవు దానిన్ గొని పర్ణశాలలను నీవారాన్నముల్ వండుచున్,

లక్ష్మ : ఇదే, జనస్థానమధ్యమందున్న — ప్రస్రవణ పర్వతము. నందు లేని చెట్లగుంపులతో చల్లగా నల్లగా నున్న సమీపారణ్యము. దానిని చుట్టుకొని ప్రవహించుచున్న గోదావరీ తరంగములు ఘోషతో ఘూర్ణిల్లుచున్నవి — అవే —— మహానుహాలు. అదిగో దాని మీది భాగము - తెరపిలేక కారుచున్న కారుమబ్బులతో నీలాతి నీలముగా నిగనిగలాడుచున్నది - చూడు :

రామ: అతివ స్మరింతె యీ గిరిని పోని యెఱుంగక యింత, లక్ష్మణా
శ్రిత విహితోపచారముల ప్రీతి సుఖించిన నాటి నాళ్ళు. సం
సృతములు గౌతమీరసమనోహరతీరములన్ దలంతువో
స్మృతి కలదో సఖీ ! మన సమేళవిహారము లాతటంబులన్.

మఱియును,

ఇట భాషింతుము మందమందముగ నేమేమో ప్రియాసక్తి ము
చ్చటలఁ చెక్కిలి చెక్కిలిఁ కలిపి యిచ్చల్ తీఱ; నేకాంతసం
ఘటితాలింగన బద్ధబాహువులమై - గారాములఁ తేలగా
ఎటులో జాములు జాఱె, రాత్రి గతమయ్యెఁ గుర్తు రాకుండగఁ.

లక్ష్మ: ఇది పంచవటియందు తారసిల్లిన శూర్పణఖ.

సీత: హా ! ఆర్యపుత్ర ! ఇంతవఱకే మీ దర్శనము.

రామ: ఆయీ ! అప్పుడే వియోగభీతిని పొందుచున్నావు. ఇది చిత్ర పటమే సుమీ !

సీత: ఏమయినాసరే దుర్జనులు నిజంగా సంకటమునకు కారకులు.

రామ: హా విధీ ! జనస్థానమందు జరిగిన కథ ఇప్పుడు - ఇక్కడకు - తిరిగి వచ్చినట్లున్నది — నాకు.

లక్ష్మ: కటా ! ఇది ఆనాటి కుటిల కథ.

కనకకురంగకైతవముగా ఖలదైత్యులు కూర్చినట్టి వం
చన విషమార్థ మప్పుడటు శోశితమయ్యె, పునర్భవించునే,
అనఘుని నిన్ను ఆ విజనమైన జనస్థలి నేర్చినట్టి వే
దనలకు వజ్రముల్ పగిలె తాళగ జాలక ఱాళ్ళు నేడిదెఁ.

సీత: అవును. ( కన్నీరు నించుచు తనలో ) రఘుకులానందుడు నా నిమిత్తముగా ఇంత చింతాశిథిలు డయినాడు.

లక్ష్మ : (రాముని పైపు చూచుచు సహాస్యముగా) ఏమిది ?
పెరిగిన మంచి ముత్యముల పేటపలెకా భవదశ్రుజాలము ల్
దొరలెడు ధాత్రి. ధారలయి - తున్నిన తుంపురులై : నిరోధని
ష్ఠురమగు నాత్మతాపనకఠోరభరంబును తెల్పు తీవ్ర ప
స్ఫురితము లైన ఏ యధరములా - పుటపేశల నాసికాగ్రముల్.

రామ : తమ్ముడా !
ప్రియుడన సత్యమోగ పరిపీడన మన్సుప ప్రతీక్షణం
బయినను పైచినాడ సురితారిజన ప్రతిఘాతవాంఛ: దా
ని యిపుడు క్రమ్మరకా రగిలి నిష్ఠురమైన తదార్తి వహ్నిసం
చయము మనోమయవ్రణముచంద్రమునకా వ్యథియించు మర్మముల్.

సీత : అబ్బా ! కష్టమే ! కట్టబడాటిన ఈ సముత్కంఠ సంతాపవేగములో
నేనుకూడా ఆర్యపుత్రునికి భారమై - ఒంటరిదాన నైనట్లున్నాను....

లక్ష్మ : (తనలో) కానిమ్ము - ఈ సంవిష్టేశము దాటింతును.... (ప్రకా
శముగా) ఇదుగో, పక్షికులప్రభువు - జటాయువు - మన్వంతరముల
నాటి పురాణపురుషోత్తముడు—ఈ పితృపాదుని పరాక్రమప్రకరణము
ఇక్కడ ప్రకటితమగుచున్నది.

సీత : తాత ! బిడ్డలపట్ల జనకులకుండు సంభృతస్నేహ మెట్టిదో అది
యందు సాక్షాత్కరించినది.

రామ : తండ్రీ ! కాశ్యపకులీన ! విహంగస్వామి ! మీవంటి తీర్థంకరుల
సాధూత్తములు ఎందేని ఇక సంభవింతురా !

లక్ష్మ : ఇది జనస్థానమున కావలి దండకారణ్య పశ్చిమభాగము. అది
దనుకబంధుడు అధిష్ఠించిన కుంజవంతము. ఇది ఋష్యమూక గిరి

వెద మతంగాశ్రమము. ఇక్కడనే వానరులనే వేటకాండ్ల జాతికి చెందిన సిద్ధురాలు - శ్రమణి - నివసించును. అదిగో! పంప యను పేరిటి పద్మకాసారము.

సీత : ఇక్కడనే కదా! కోపము విడిచి - ధైర్యము తూలి ఆర్యపుత్రుడు ఎలుగెత్తి ఏడ్చినది.

రాము : దేవి! రమణీయముగా ఉన్న ఈ కాసారము.

నాలుపులు తేజు చంచుచరణంబుల యించలు జెక్క లార్చుచున్
కలచగ తెల్లతామరలు కాడలతో తలడిల్లు - నల్ల క
ల్వలు నిలువెల్ల పూచు - నపలక్ష తిలకించెద నీ విభాగమున్
కలికిరో! కంటబాష్పములు క్రమ్ముచు రాలుచునుండు సందులన్.

లక్ష్మ : ఆ మహామహాండు - హనుమంతుడు - ఇతడు.

సీత : దీర్ఘశోకాకులమైన జీవలోకమును ఉద్ధరింప గల సమర్థుడు. సత్వశాలి.

రాము: ఎవని బలసత్వసంపత్తి నేము నఖిల
భువనములును కృతార్థత బొందినాము;
అంజనానంద వర్ధనుడయిన యట్టి
ఈ మహాబాహు గంటి మదృష్టవశత.

సీత : వత్సా! పూచుచున్న కడిమి చెట్లమీద నెమిళ్లు నృత్యముచేయు చున్నవి. ఈ కొంచపేరేమి? తన శరీరసహజ మయిన సౌభాగ్య విలసన మొక్కటే మిగులగా, ధూళిధూసరచ్ఛాయతో నున్న నాథుడు ఏడ్చుచున్న నిన్ను ఆసుకొని ఆ చెట్ల క్రింద మూర్ఛిల్లినట్లు లిఖించ బడినాడు. ఏమిది?

లక్ష్మ: ఇది యల మాల్యవంతము - పయిఁ శిఖరంబున నీలమేఘముల్
పొదివెడి - గుప్పెడిఁ గకుభపుష్ప సుగంధము........

రామ: .... .... చాలు లక్ష్మణా!

వదలుము తత్ప్రసక్తి - నిక పైన సహింపగలేను సుంతయున్,
మొదలిటి జానకీవిరహ మూర్ఛ నను పునరావహించెడిన్.

లక్ష్మ: ఇక ముందు ఆర్యపుత్రుడును - వానర దానవులును — కావించిన ఆశ్చర్యకార్యములు లెక్కలేనన్ని చిత్రింపబడియున్నవి. వదినగారు ఇప్పటికే అలసినట్లున్నారు. విశ్రమింపుడని విన్నవించుచున్నాను.

సీత: ఆర్యపుత్ర! ఈ చిత్రలిఖితములను చూచిన పిమ్మట నా కొక వాంఛ పొడముచున్నది. ఆ విషయమును నేను విజ్ఞాపింతునా?

రామ: తప్పక ఆజ్ఞాపింపుము.

సీత: ప్రసన్నములై గంభీరములైన వనాంతర వీథులలో విహరింప వలెననీ, పవిత్రమయిన భాగీరథీతీర్థములలో చల్లగా, సౌమ్యంగా స్నాన మాచరింపవలెననీ, మన సగుచున్నది.

రామ: వత్సా! లక్ష్మణా!

లక్ష్మ: ఇక్కడనే ఉన్నాను.

రామ: తమ్ముడా! గర్భిణీదోహదములను శీఘ్రముగా కావింప తగునని గురుజన మిప్పుడే గదా ఉపదేశించి పంపిరి. కాబట్టి అదురు బెదురులం లేక సుఖంగా నడిచే రథమును పన్నింపుము.

సీత: ఆర్యపుత్రుడును నాతో అక్కడికి రావలయును....

రామ: ఆయి! కఠినురాలా! అదికూడ నీవు చెప్పవలయునా?

సీత: అలాగయితే, ఇది నాకు అత్యంత ప్రియము.

రామ: అయి! ఏమి వెదకుచున్నావు?

> పరిణయ కాలమునాటిగ సువాసిని! ఎన్నడు అన్యసంస్పర్శము
> ఎఱుగక - ఇంటనున్న - పని తీగిన - శైశవ యౌవనాల
> సమయమందేని పాయక వెన్నంటుడి సుశ్రూషోపచారతై
> తిరిగిన నాహస్తము నిదే తలదిండుగ నొసంగుచుంటి!

సీత: (నిద్ర నటించుచు) ఉన్నది. ఆర్యపుత్రా! అదెప్పుడు నాకు ఉండనే ఉన్నది.

రామ: ప్రియవచనము లాడుచు ఏమో అస్పష్టముగా పలుకుచున్నది. (సాలోచనముగా)

> నా గృహలక్ష్మి యీమె - నయనంబుల కార్ద్రసుధాశలాక - ఏ
> రాగిణి స్పర్శనంబు మెయి రాచిన చందన: మీమె బాహువే మౌ
> క్తిగణ చిక్కణాఢ్యమగు కంఠసరంబు: ప్రియంబుగాని ఏ
> భాగము లే సుమంగళికి-ప్రాప్తవియోగ మొకండు గాదిలన్.

ప్రతీహారి: (ప్రవేశించి) దేవా! వచ్చాడు!

రామ: ఓయీ! ఎవడు?

ప్రతీ: దేవరవారి దగ్గర ఉండే పరిచారకుడు — దుర్ముఖుడు.

రామ: (తనలో) అంతఃపుర పరిచారకుడు - దుర్ముఖుడు - పట్టణములోని జానపదులవాడలలో అపసరించి రమ్మని పంపితిని. (ప్రకాశముగా) రానిమ్ము.

దుర్ముఖ: (ప్రవేశించి తనలో) కటా! సీతాదేవినిగూర్చి ఇలాంటి జనాపవాదమును మహారాజునకు వినిపించుట ఎట్లు! .... లేదు. భృత్యునకు సదా నాబోటి నిర్భాగ్యుడు చేయవలసిన పని.

సీత: (కలవరించుచు) హా! సౌమ్యుడా! ఆర్యపుత్రా! నీవు ఎక్కడ ఉన్నావు.

దుర్ము: ఆ .... ఎట్లు? అగ్ని పరిశుద్ధురాలయిన అకలంకను - రఘుకులాంకురములను మోయుచున్న నిండు చూలాలిని - దుర్జనుల మాటమీద దేవర దూరము చేయుదురా!

రామ: శాంతమ్! పౌర జానపదులు దుర్జను లగుదురా! ఎట్లు

జనుల కభిమత పాత్ర మిక్ష్వాకు కులము.
దైవ వశమున నడికి విత్తనము పడెను -
అకడ ఘటిల్లె శుద్ధి నా డద్భుతములు:
ఎవరు నమ్మెదు రతిదూర వృత్తములను.

కావున - సౌమ్య.

దుర్ము: హా దేవీ .... ఓ .... (నిష్క్రమించును)

రామ: కటకటా! కష్టమ్. అతిబీభత్సమయిన, కార్యముచేసి పాపాని ఘాతుకుడ నయితిని-

చిన్ననాటినుండి చెలిమి పెంచిన ప్రియను,
స్నేహనిరతి నితర చింత లోపని దాని,
నింటపెట్టి మృత్యు కందించు చున్నాడ.
ఇంట చిలుకను బలియిచ్చు బోయవిధాన.

అంటుచే తాకరాని పాతకినైనాను నేను. ఇక దేవిని ఏల మైల చేయవలెను.

(సీత శిరమును తనంతట తానే పైకెత్తి - చేయి లాగుకొనును)

కని వినని యట్టి కర్మచండాలుడ
వేల! నన్ను విడిచిపెట్టు మింక;
మంచి చందనంపు మ్రాకని భ్రమసి చే
రితివి విషవిపాక వృక్షము నిటు.

(లేచి) ఆహా! జీవలోకము తాఱుమాఱైనది - జీవిత ప్రయోజనము కూడా సమాప్తమయినది - లేదా: రాముని పాలిటికి శూన్యమయిన ఈ జగత్తు ఎండిన అడవిగా మాఱినది. ఆ - సంసారములోని సారమె ఆఱిపోయినది. ఈశరీరము కూడ కాష్ఠ ప్రాయమైనది. కటా! నాకు శరణ్యమే కానరాదు. ఏమి సేయుదును! ఏదిగతి! ఇంక —

శోకవేదన ననుభవించుటకు మాత్ర
మున్టియున్న దీ చైతన్య మకట రాము:
ప్రాణములు వజ్ర కీలము పాతిబిగిసి
హృదయ మర్మఘాతముగ కాల్చెందు కెరలి.

అంబా అరుంధతీ! భగవత్పాదులారా! వశిష్ఠ విశ్వామిత్రులారా! దేవా! పావకా! హా! భగవతీ విశ్వధాత్రీ! హా! జనకరాజర్షీ! హా! తండ్రీ! హా తల్లులారా! హా! పరమోపకారీ లంకేశ్వరా! హా ప్రియసఖా సుగ్రీవా! మహాకృతీ మారుతీ! హాచెలీ! త్రిజటా! మీరందఱును మోసపోతిరి - తిరస్కృతులైతిరి. ఈ ఘాతుకుడు రామునిచేత -; కాగా - వారి నిప్పుడు నే నేమొగము పెట్టుకొని పిలుతును.

పాప మహాత్ములె; అయినన్
ఘోరకృతఘ్నుడు - మరాత్మకుం - డగు నాచే
సేసుకొనబడిన పాపం
బారక వారలను తాకు నని భావింతున్.

అంతటి దురంతకుడను నేను. ఎట్లూ!

సీత : హా ! సుకుమారుడా : ఆర్యపుత్రుడా ! (సవేగముగా లేచి) ఛీ.... పీడకలలో ప్రియుని ఎడబాసిన దానవైతిని. అయ్యో ! అయ్యో ! ఆర్యపుత్రా ! నీకొఱకు ఆక్రందించుచున్నాను.

(అంతటను పరికించి కలయచూచి)

హా కష్టము. హా కష్టము. ఒంటరి దానిని — ఒడలు మఱచి నిద్రించుచున్న దానిని—నన్ను ఉజ్జగించి వెళ్ళిపోయినాడు. నా నాథుడు. ఇదియెట్లు జరిగినది ? కానిమ్ము. కనబడినప్పుడు చాలుదునేని నేనాయనను కోపింతును. ఎవరక్కడ ? పరిచారకులు !

(ప్రవేశించి)

దుర్ముఖు : దేవీ ! లక్ష్మణ కుమారుడు ఇట్లు విజ్ఞాపించు కొనుచున్నాడు. 'రథము సిద్ధముగా నున్నది. దేవి మీరు ఎక్కవచ్చును.'

సీత : ఇదే ఎక్కుచున్నాను.

(లేచి అటునిటు నడుచుచు)

గర్భభారము కదలుచున్నటులున్నది. నెంపాదిగా నడుతుము.

దుర్ముఖు : ఇటు దేవీ ! ఈలాగున....

సీత : రఘుకుల దేవతలకు నమస్సులు. తపోధనులకు నమస్కారము.

(అందఱును నిష్క్రమింతురు)

—

# ద్వితీయాంకము

---

(తెరలో)

తపస్విం...రాలికి స్వాగతము.

తాపసి : (బాటసారి వేషముతో ప్రవేశించి) ఓహో! ఈమె వనదేవత.
పూలతో - పండ్లతో - పల్లవములతో అర్ఘ్యము గొనివచ్చుచున్నది.

వనదేవత : (ప్రవేశించి - అర్ఘ్యమిచ్చి)

సుదినము నాకు నే - డటిది సుమ్మీ తపోధన సత్సమాగమం
బిది, బహుపుణ్య యోగఫల - మీవనమెల్లను మీదె, స్వేచ్ఛగా
ఒసవినఛాయలో - జలములో - మఱి పండ్లు - తపోజనాళి కొ
ప్పదమగు సంపలో - అనుభవింపుడు లేవిట మీకు నష్టముల్.

తాపసి : ఇదిచెప్పవలెనా....

వినయమితో స్త్రీపై ఖరియు - పేశలమైన ప్రియాయిత ప్రవ
ర్తనము - నిసర్గమంగళ పరాయణబుద్ధి - గతాగతంబులన్
పొంగని ప్రీతి - భాషణలు త్రొక్కని నేస్తము నొప్పె-అచ్ఛమై
అనుపధియైన సాధుచరితార్థ - మబోధ రహస్యమెయ్యెడన్.

(కూర్చుండురు.)

వ.దే. : మహాశయను - ఎవరుగా భావింతును -

తాపసి : నేను ఆత్రేయిని.

వ.దే. : తపస్వినీ! ఎక్కడినుంచి మీరాక? దండకారణ్య సంచారము
నకు అవసరమేమయిన కలిగినదా!

అత్రే: ఈ ప్రదేశమున అగస్త్యఋషి ఋషులు
పలువు పద్గీథవేత్తలు కల రని విని :
వారి జేరి వేదాంత విచార మెఱుగ
సంచరింతు వాల్మీకి పార్శ్వమును విడిచి.

వ.దే. : అమ్మా ! ప్రాచేతసుడు పరమఋషి – ఆయన పురాణబ్రహ్మ వాది యని ప్రతీతి. ఇతర మునులు కూడ బ్రహ్మపారాయణ ముపాసించుటకై అయననే సేవింతురు. అట్లుండగా మీ రేల ఈ సూర దీర్ఘ ప్రవాసమున ప్రయాసపడి వెడలితిరి ?

అత్రే : అక్కడ మాఅధ్యయనమునకు గొప్ప అంతరాయము కలిగినది. అందువలన ఈ దీర్ఘప్రవాసము నిచ్ఛగించితిని.

వ.దే. : అది ఎట్టిది ?

అత్రే : ఎన్నడు వినని అద్భుతప్రకారమొకటి జరిగినది. ఎవరో ఒక దేవత పాలు విడిచిన పసి బాలకులను ఇద్దరిని తెచ్చి పెంపమని భగవంతుని కప్పగించి వెళ్ళినది. తరువాత–అచ్చటి సంయమివర్గమే గాక సకలచరాచరజాతము కూడ – అంతరంగములు కరిగిపోగా – ఆ బాలకులపట్ల స్నేహబద్ధ మయినది.

వ.దే. : వారి పేర్లు జ్ఞాపకమున్నవా ?

అత్రే : ఆ దేవతయే — ఆ బాలకుల పేర్లు — లవకుశు లని వాకొని, వారి ప్రభావమును గూడ తెలిపివెళ్ళినది.

వ.దే. : వారి ప్రభావ మెట్టిదో .... ....

అత్రే : జృంభకాస్త్రములును–వాని మంత్రరహస్యములును–ఆ శిశువులకు పుట్టుకతోనే సంసిద్ధములయినవి .... అని.

ప.దే. : ఓహో! ఇది విచిత్రమే .... ....

ఆత్రే : మహర్షియే వారికి ఆదిగా పరిచరించి-పెంచి-సంరక్షించినాడు. మఱిన్ని - కేశఖండనము జరిపించి - మూడువేదములుతప్ప మిగిలిన విద్యలన్నియును వారిచే సావధానముగా చదివించెను .... [illegible] గర్భస్థులయినది మొదలు పదునొకండవ యేట క్షత్రియ సంప్రదాయముగా ఉపనయనము కావించి-వేదాధ్యయనము చేయించెను. ఉజ్జ్వల ప్రజ్ఞగల ఆ మేధావులతో మావాండ్లకు ఏకపాఠయోగము కుదరలేదు. అటులే గదా ....

> గురుడు మునిశిష్యులకు జడునకు సమముగనె విద్యనిచ్చు, ఏ
> వ్వరి బలంబు మాత్రము అపంబును కుంచను పెంచలేదు: అం
> తరము కొలంది దాని పరిణామము తేలును; బింబగ్రాసముల్
> మెఱుగులు తేజు రత్నమున మృత్తికబలంబున మూఢమైపడున్.

ప.దే. : మీ అధ్యయనవిఘ్నానికి ఇదే కారణమా!

ఆత్రే : ఇంకొకటి ఉన్నది.

ప.దే. : అది ఏలాంటిది?

ఆత్రే : బ్రహ్మర్షి-- ప్రాచేతసుడు, ఒకనాడు మధ్యాహ్నవేళ తమసానదిని చేరబోయినాడు అక్కడ - జంటగా పెనగొన్న క్రౌంచపక్షులలో - ఒకదానిని - కిరాతు డెవడో చంపగా చూచెను. అప్పుడు అకస్మాత్తుగా దివ్యమైన భాషిత మొకటి ఆయనముఖమున అవభాసించెను. అది - అక్లిష్టమయిన అనుష్టుప్ఛందస్సుగా రూపొందినది.

> బ్రదికియుండబోవుగా నిషాదుడ! శాశ్వ
> తముగ - ఎల్లవత్సరములు నీవు;
> క్రౌంచ మిథున మందు-కామమోహిత నొక్క-
> దాని చంపినావు దారుణముగ.

వ.దే. : విశ్రమించి, ఆమ్నాయములుండగా-వానికి వేఱై-నూతనచ్ఛందస్సు అవతరించినది.

ఆత్రే : అపుడే భూతభావనుడయిన బ్రహ్మదేవుడు - శబ్దబ్రహ్మవిష్కా-రములో ప్రకాశించు ఋషిని సమీపించి ఇట్లు పలికెను. " ఋషీ ! నీకు వాగాత్మకమైన బ్రహ్మప్రబోధ మయినది. రామచరితము ప్రవచింపుము. నీప్రతిభాచక్షుస్సునకు ప్రతిరోధములేదు. అది-జ్యోతిర్మయమై ఆర్షవిభూతి నందినది. నీవు ఆదికవివి " అని — అట్లే అదృశ్యుడయ్యెను. అనంతరము భగవాన్ప్రాచేతసుడు ఇతిహాసముగా రామాయణము రచించెను. అదిశాసే-తొలుతొల్తగా మనుష్యలోకమున శబ్దబ్రహ్మ వివర్తమై భాసించెను.

వ.దే. : బాగు — సంసారము పండినట్లయినది....

ఆత్రే : ఈకారణముచేతనే మాఅధ్యయనమునకు గొప్ప అంతరాయము కలిగినదంటిని.

వ.దే. : సమంజసంగానే ఉన్నది.

ఆత్రే : నేను విశ్రమింతును. సుభాగినీ ! ఇక నాకు అగస్త్యాశ్రమము నకు మార్గము చెప్పుము.

వ.దే. : ఇక్కడినుండి పంచవటీ వాటికను ప్రవేశింపుము. అటుమీద గోదావరీతీరముననే నడిచిపోవచ్చును.

ఆత్రే : (కంట నీరు కారగా) హా ! ఇది పంచవటి — ఆ తపోవనమా? ఆ నది గోదావరేనా ? మఱి — యీ గిరి ప్రస్రవణమా ? అయితే జనస్థాన కులదేవత — ఆ వాసంతివా నీవు ?

వ.దే. : అది అంతా నిజమే.

ఆత్రే : వత్సా ! జానకీ !

మా ప్రసంగ కథాగతి నీ ప్రియ సఖి
నాదు బంధువర్గములు జ్ఞాపకము రాగ
నామశేషంబుగా పోయినను కుమారి
నిన్ను ప్రత్యక్షముగ చూపుచున్న విధిని.

వాసంతి : (భయముతో తనలో) ఆ నా సఖిని నామశేషఅన్నదే ఈమె....

(ప్రకాశముగా)

తల్లీ ! సీత క్షేమమైనా అపాయమైనదా ?

ఆత్రే : అపాయమే కాదు .... అపవాదు కూడా (చెవిలో) ఈవిధంగా జరిగింది.

వాసం : అబ్బా ! ఈ దైవవిధానం దారుణనిర్ఘాతంగా ఉన్నది.

(మూర్ఛిల్లును)

ఆత్రే : భద్రే ! గాసిల్లకు — ఊరడిల్లుము.

వాసం : (తెలివి తెచ్చికొని) హా చెలీ ! సీతా ! నీ జన్మఫల భాగధేయ మింతేనా ! హా ! రామభద్రా ! ఇక ఆయనతో నాకేమి కావలె.... ; అనఘమయీ, ఆత్రేయీ ! అప్పుడు - ఆ విధాన - లక్ష్మణుడు అడవిలో పడవేసివచ్చిన తరువాత సీతావృత్తాంత మేమయినా తెలిసినదా ! చెప్పవమ్మా ....

ఆత్రే : లేదు — లేదు .... ....

వాసం : కష్టమ్. అకటా ! అరుంధతీ వశిష్ఠులు నడుపుచున్న సత్కాలములో - పైగా — వృద్ధరాజులు జీవించియుండగా ఇట్టి కట్టిడి చెయిదము ఎట్లు జరిగినదో ? .... ....

ఆత్రే : ఋష్యశృంగుని సత్రయాగములో పెద్దలందరు నిలిచిపోయిరి. పన్నెండేండ్లు ప్రవర్తిలిన ఆ సత్రయాగము ఇప్పుడే ముగిసినది.

పూజను పూర్తి చేసి ఋష్యశృంగాదులు సదస్యులకు ఆహ్వానములు పంపినాడు. ఆ సమయమున భగవతి అరుంధతి "కోడలులేని అయోధ్యకు నేను పోనన్నది" రామమాతలు కూడ ఆమాటనే ఆమోదించిరి. అప్పుడు వశిష్ఠుడు ఆలోచించి, 'వాల్మీకి తపోవనమునకు పోయి అక్కడ నిలిచెదము' అనెను.

వాసం : అయితే, ఇప్పుడా మహారాజు ఎట్టి యనుష్ఠానములో నున్నాడో !

ఆత్రే : రాజానుక్రమణీయమైన అశ్వమేధక్రతువు నారంభించినాడు.

వాసం : అరె ! పెండ్లికూడ చేసికొనెనా ?

ఆత్రే : శాంతమ్. లేదు. లేదు.

వాసం : అలాగయితే ఆ యజ్ఞకర్మయందు సహధర్మచారిణి యెవరున్నారు ?

ఆత్రే : సువర్ణమయమైన సీతాప్రతిమ.

వాసం : ఓహో !

అమిత కఠినమ్ము లయ్యు వజ్రములకంటె-
మంచి పుష్పాలకంటె కోమలము లగును,
అఖిల లోకోత్తరచరిత్రు లయినవారి
చేతము తెలియంగ నెవ్వరిచేత నగును.

ఆత్రే : వామదేవపురోహితులు అభిమంత్రిణము నిర్వహింపగా-పూతమయిన యజ్ఞాశ్వమును ఉత్సర్జించి శాస్త్రసమ్మతముగా దానికి రక్షకుల నేర్పఱచిరి. లక్ష్మణకుమారుని చంద్రకేతును సర్వాధిపతిగా పంపిరి. సంప్రదాయ ప్రకారము అతనికి దివ్యాస్త్రముల నిచ్చి చతురంగబలమును సహాయ మంపిరి.

వాసం : (స్నేహకౌతుకములతో బాష్పములు రాలగా)
అమ్మయ్యా! భాగ్యం. కుమారలక్ష్మణునకా పుత్రుడు! తల్లీ! ఇక బ్రతికితివి. నేను బ్రతికితిని.

ఆత్రే : అంతలో - ఒకానొక బ్రాహ్మణుడు - చచ్చిన కొడుకు నెత్తికొని వచ్చి రాజద్వారముముందు - గుండెలు బాదుకొనుచు - "రక్షింపుడు - రక్షింపుడు" అని ఆక్రందించెను. అంతట, "ఏదో రాజాపచారము లేనిది ప్రజలలో అకాలమృత్యువు జరుగ దని కరుణాసముద్రుడగు రామభద్రుడు - ఆ దోషము తనదిగా భావించుకొనెను ........ అపుడు ఆకాశమునుండి ఒక పలుకు వినబడెను.

శంబూకు డను వృషలుడు త
పం బుర్విని సల్పుచున్నవాడు - శిరశ్ఛే
దం బాచరించి - అతని వ
ధంబున బ్రతికింపుము వసుధాసురసుతునిన్" అని.

ఆ ఉపశ్రుతిని ఆలకించి, రామచంద్రుడు కృపాణపాణియై, పుష్పకవిమాన మెక్కి - దిగ్దిగంతముల నంతటను - శూద్రతాపసిని వెదకుచున్నాడు.

వాసం : శూద్రశంబూకుడు, ధూమపానము చేయుచు - ఇందే - ఇచటనే జనస్థానమందు తపమాచరించుచున్నాడు. అందువల్ల, రామభద్రుడు, తిరిగీ, ఈ వన మలంకరింపవచ్చును.

ఆత్రే : భద్రముఖీ! ఇంతలోనే ఆయన ఇచటికి రావచ్చునేమో!

వాసం : అట్లే కావచ్చు.... కాని - పగటిపూటలప్పుడే తీవ్రించుచున్నవి.

పురుగుల్ తిన్న బెరళ్ళులాగ విహగంబుల్ నీడలం జెల్కుచున్.
అటవం గ్లాంతకపోతసంతతి కులాయశ్రేణులం, గండ కం
ధరముల్ రాయ కరుల్ జిలం; తరువు-లెండంజాసల్లవృత్తంబులం
దరువుశ్శైళ్ళ పడు గొంతపుష్పములతో-నర్చించు గోదావరిన్.

(పరిక్రమించి నిష్క్రమింతురు)

శుద్ధవిష్కంభము

(అప్పుడు పుష్పకముమీద సదయాఖడ్గపాణియై
రాముడు ప్రవేశించును)

ఏషిణకరమా ! చచ్చిన ధరణీసురు c
శువును బ్రదికింపు-మని నేసి శూద్రమునిని-
నిండుచూలాలి నడవి కనిచిన రామ
బాహూ మైతివి కరుణ యేపాటి నీకు.

(ఎట్టులో ఖడ్గమును విసరివైచును)

ఆ-రామునికి సరిపోయిన దీ కర్మ. ఆ బ్రాహ్మణవత్సకు ప్రాణ
ములు వచ్చునా !

దివ్యపురుషుడు (ప్రవేశించి).

దేవా ! జయము, జయము.

"యమునివలన నైత మభయ మిచ్చెను. నీక
రాసిధార - బ్రతికె నర్భకుండు-
నీ చరణముల తల నిలిపె శంబూకుండు;
ధ్వంసమేని ! అగును తారకమ్ము."

రామ : రెండునూ మాకు ప్రియములే. ఇకమీద మహోజ్జ్వలమైన నీ
తపస్సుకు తగిన ఫలము ననుభవింపుము.

ఎందు ఆనందమోదము లందనోపు
సంభవంబగు బహుపుణ్యచయన మెచట,
తేజరిల్లు లోకములు పై రాజనములు-
కలపు, బొందెద పవి నీ వికజ ప్రపంబు.

శంబూకు : దేవా ! ఈ మహిమయంతయును మీ ప్రసాదఫలమే. ఇంక తపస్సేమీయగలదు ? అట్లననేల ? తపస్సే నాకు మహత్తరమగు ఉపకారమైనది.

నిను భూతేశు శరణ్యు బొందుటకు అన్వేషించు లోకంబు వె
ల్లను, విచ్చేసితి, వల్లు-నజ-వృషలు-నేలజ-దాటి వేలామడల్;
చన బో లిట్టుల నా తపఃఫలితముల్, కాదేని యీ దండకా
వనమే మూల ! అయోధ్యయెక్కడది దేవా ! నీవు రా క్రమ్మఱన్

రాము : ఏమీ ! దీనిపేరు దండకా ! (అంతటను అవలోకించి) ఆహా ! ఎట్టిది ....

మసృణశ్యామము లొక్కచో-ఒకట భీష్మగ్రావ కాఠిన్యముల్,
దెసలజ త్రుళ్లెడు ఘాంకరించుచు స్రవంతీధార లంతంతటన్,
పొసగుజ తీర్థములుజ దరుల్- గిరిసరిత్ పుణ్యాశ్రమారణ్యముల్,
మనసుజ మచ్చికలైన యీ కడల జాడల్ దండకాభూములై.

శంబూక : అవును, ఇది దండకారణ్యమే. ఇక్కడనే కదా మునుపు,

పదియు నాల్గువేల పదునల్వు రసుర లని
తెగిరి నీక రాసి - త్రిశిర ఖర దూషణులు.

దుర్బలులగు మాబోటి పల్లెవారుకూడ నిర్భయముగా సంచరించుటకు వీలైనది.

రామ : ఇది దండకారణ్యమే కాక - జనస్థానముకూడానా ?

శంబూక : నిజము - ప్రాణులకెల్ల గగుర్పెత్తించు - ఉన్మత్త చండజంతు కాండముతో సంకులములగు కొండకోన లిక్కడనే కలవు. ఈ జన స్థానమునంటి బలిసెన దీర్ఘారణ్యములు దక్షిణముగా విస్తరించినవి. శిలకింపుడు....

అలికిడి లేక నిశ్చలముగా నొక వాడ
ప్రాలు క్రూరమృగాల యడుగు లొకట,
స్వేచ్ఛగా సుఖనిద్రచెందు పెన్పాముల
శ్వాసఘోషల విషజ్వాల లెత్తు,
దాహంబు తీఱ కెద్దడి నెత్తెలకా కొండ
అజగర స్వేదము నాని శనియు.

రామ : చూచుచున్నవాడ సుమి జనస్థానమును,
అసురఖరుని పూర్వవసతి వాసంబులను,
అనుభవించుచుంటి నా పూర్వవృత్తాంత
మడరి జరుగుచున్న యట్లు ప్రత్యక్షముగ.

(అంతటను కలయచూచి)

వైదేహీ సర్వథా ప్రియారామ గదా : అట్టివే ఈ కాంతారములు. ఇక నాకు భయమెందుకు ?

(కన్నీరు నించుచు),

"నీవు తోడ నుండ నివసింతు నిష్టముగ
మధుమధకల గంధమయములగు నీ వనుల"
అనుచు అనుసరించె నబల నాతో నిచట
ఆమె స్నేహ మట్టి దగు - నగును-నాపట్ల.

అది యట్లే.

ఏమి చేయ కించుక కలఁకల మాత్ర
సుఖముచే దుఃఖమును మాపు సుహృదు డెపుడు.
తత్ప్రియ జనంబుకంటె సాంత్వన మొసంగు
ప్రియమయిన ద్రవ్యమేది జీవితమునందు.

శంబూక : దురాసదములయిన ఈ గహనములమాట చాలును. ఇటు చూడుము. ఇవి మధ్య మారణ్యములు-ప్రశాంతములు - గంభీరములు. అవిగో మత్తిల్లి కేకలువేయు నెమిళ్ళ కంఠకాంతులతో క్రాలు చున్నవి ఈ కొండలు; వానిమీద చిక్కగా పెరిగిన సున్న చెట్లు నల్లగా సంపెల్లుచున్నవి. బెదరక భీతిచెందక ఇందు తిరుగుచున్న వివిధ జంతుసంతానమును తిలకింపుడు.

పులుగుల్ త్రొక్కగ జాఱు వేతసలతా పుష్పాళితో, వాసనా
మిళితంబైన తుషారతోయముల యూర్మివ్రాతముల్ మ్రోయగా,
ఫలభారంబున శ్యామలంబులయి, పేసల్దేఱు నేరేటి మ్రా
కులతాకిళ్ళకు ద్రుళ్ళి ఘూర్ణిలు నవే కూలంకషా నిర్ఝరుల్.

మఱియు - ప్రభూ!

ఉడికి ఆవులింప పడుచు భల్లూకములు
చరులు మాఱుమ్రోగి పెరుగుజా భయధ్వనులు;
కరులు చీల్చి చెరగ కణుపులంబడికారు
సల్లకీశి శిరకషాయ సౌగంధ్యములు.

రామ : (కన్నీళ్ళు నాపుకొని)

వత్సా! నీకు త్రోవలు శుభములగును గాక — దేవయానముల నంటిపోయి పుణ్యలోకములు పొందుము.

కంటూక : అన్లే ! అనాది బ్రహ్మవాదియైన అగస్త్యునకు అభివాద మర్పించి, శాశ్వత పదమును ప్రవేశింతును.

(నిష్క్రమించును)

రామ : ఎచట పూర్వము వసియించినాము చిరంబు
ఇదియ దేవనంబు ఇపుడు చూతును మఱల
అటసుఖించితిమి గృహస్థులమును - వనస్థు
లము నగుచు స్వధర్మ సమయాభిమతరతిని.

ఇంకను

కేకాశ్రుతినెమిష్ఫ క్రీడించు గిరులివియె
మత్తిలిన హరిణములు ఒసలు వనతలము లివె
మంజువంజుల లతల్ మలయు వాటిక లివియె
నవనీలనిచుళములు నసుచు నదితటము లివె.

మఱియు ....

దూరమునకు చూడ తోచు మేదురమేఘ
మాలవోలె నీల నీల మగుచు -
పుట్టువొందె నిచట పుణ్యగోదావరి -
ప్రస్రవణగిరీంద్ర పాదమిదియె !

అన్లే

ఈనగ శృంగమం దవుడు వృద్ధజటాయు నివాసముండె, ఆ
కోనలనుంటిమేమును నికుంజముక్రింద, ప్రవాహ గౌతమీ-
తానము లాడ నీలతరుధామము - కొమ్మలలో శకుంతముల్
గానముచేయ - రమ్యములుగా చెలువారిన వీవనాంతముల్.

ఆహా! చిరకాలమున్నందువలన వివిధములైన మాస్నేహానులాపములకు ఈ ప్రదేశములు సాక్షులైనవి. నా ప్రియురాలికి ప్రియసఖియైన వాసంతియును అపుడు ఇందే వసించుచుండెను. కటా! క్రూరుడగు రామునకు నేడేమి సంభవించినదో!

చిరసంతాపము దుర్విషంబుపలె నుజ్జృంభించె ఠీంద్రించుచున్,
ఉరువేగంబున నొత్తిపిచ్చటిలె స్నాయుశ్శల్య శాతవ్యథల్;
పఱియల్ బాఱు అరుంతుదవ్రణనిగుప్త గ్రంథిచందాన - ఈ
కరుడుల్ గట్టిన శోకమి ట్లురలి నన్ కాటాడు కొంగ్రొత్తగన్.

కానిమ్ము; ఆనాటి మాకు మిత్రసంమితము లయిన భూమిభాగములను చూతుము. (నిరూపించుచు) అహో! ఈ నేల పడకలు నిలుకడ లేనివి.

పూర్వము సెలయేళ్ల పొరలి పొంగిన చోట్ల
పడియలై తేలెను పాలయిసుక,
తొల్లి కారడవులతోడ క్రిక్కిరిసిన
ప్రాంతంబు లెడలయి పలుచబాఱె,
బహుకాల మవల గన్పట్టు కాంతారమున్
వేఱొకం డనుచు భావింపనయ్యె,
స్థావరములనున్న శైలముల్ చూడ అ
య్యదియే యిదని దృఢమగును బుద్ధి,

అబ్బా! తోసివేసికొని పోదమన్నను ఈపంచవటీస్నేహబంధము నన్ను బలాత్కరించు చున్నది.

(సేఖముతో)

స్వగృహాముపోలె నెందు దివసంబులు పుచ్చితి మేను నామెయుగా.
తగిలి సతంబు నెచ్చటి కథల్ తెగనీయక చెప్పుకొందు, మిం
పుగ ; నిపు - డా ప్రియాహతకపుణ్యుడు రాముడు తానొకండె యే
మొగమున చూచు - చూడ-కెటు వోనగు పంచవటీ మహోతటిన్.

శంబూకుడు (ప్రవేశించి)

దేవా ! జయము భగవాన్ అగస్త్యుడు మీరాక నావలన విని
మీతో ఇట్లు పలుకుమనిరి. "విమానమును దిగుతరుణమునకు వలసిన మంగళార్ఘ్యము సమకూర్చుకొని — వత్సలి — లోపాముద్ర వేకై ఎదురు చూచుచున్నది. మా ఆశ్రమ జనమంతయును ఆమెతో నున్నారు. అందువలన ఇటువచ్చి మమ్ము సంభావింపుము. అనంత రము సుఖయానమెక్కి త్వరగా స్వదేశము ప్రవేశించి అశ్వమేధము సాధానింపుము."

రామ : అగస్త్యభగవాను లాజ్ఞాపించినట్లే !

శంబూక : అట్లైన దేవా ! పుష్పకమును ఈపై పురానిమ్ము ....

రామ : (పుష్పకము నటు పోనిచ్చి)

పరమతటీ ! పంచవటీ ! ఇది గురుజన వచనము. ఈ యను రోధముచే సంధిల్లిన రామాపరాధమును క్షణము క్షమింపుము.

శంబూక : ప్రభూ ! పరికింపుము .... ....

రొదచై పో పొదరిండ్లు ఘూకముల కాటొడ్డెంబులన్, కీచక
పరిదరాఘోషలురేగ కాకులెటుగింపన్ మానె - క్రౌంచావతం
బిది; మత్తిల్లి నెమిళ్ళు నెత్తముల నట్టిట్టాడగా; సర్పముల్
ఒదిగెణా చందన వృక్షకోటరములం దుద్వేష్టితావస్థితిణా.

మఱియును.

సుహాలన్ గుబ్బటిలుణా గళద్గళరుతిన్ గోదావరీ తోయముల్;
మహితోత్తాలపయోదమాల లివి లీలాదక్షిణా హార్యముల్;
బహు కుల్యా ప్రియ సంగమంబిదె - పయస్సంఘాత కోలాహల
గ్రహణంబై - వెలయున్ - పరస్పర గభీరక్షుబ్ధ చక్రస్థితిన్.



# తృతీయాంకము

[ అంతట తమస - మురళ - అను ఇద్దరు నదీదేవతలు ప్రవేశింతురు. ]

తమస: సఖీ మురళా! ఎందుకే? ఏదో భ్రాంతిలో ఉన్నట్లున్నావు.

మురళీ: భగవతీ తమసా! పూజ్యపాద - అగస్త్యపత్ని గోదావరీ దేవితో "ఇట్లు" చెప్పిరమ్మని నన్ను పంపినది.

"నీవు ఎఱిగియుందువు. మా కోడలిని పరిత్యజించినది మొదలు....

రామభద్రుశోకరస మడచిపెట్ట ధృతి,
పుటవిపచ్యమానస్ఫుటతరౌషధినాతి
కానరాక పయికి - లోన గాఢవ్యథా
ఘోర మగుచు కుమిలి కుదిలించుచున్నయది

అది ఆప్రకారమే అగును - ఆలాటి ఇష్టజనమును కొట్టిన కష్టములో పుట్టినదా శోకము - తెరిపితెంపులు లేక - దీర్ఘంగా - రగిలి రెచ్చిల్లు చున్నది. అందువలన రామభద్రుడు నానాట నవసి నొగిలి పోతున్నాడు. అది చూచినప్పుడు నా హృదయము కంపించును. ఇప్పుడు- అతడు - దండకనుండి తిరిగి పోవుచు పంచవటీ వనవాటికి వచ్చును. అచ్చట సీతాస్నేహ సాక్ష్యములగు ప్రదేశములను చూడక మానడు. ధీరుడే సహజముగా అతడు! ఐనను ఈలాటి అవస్థలు అనూహ్యములు. లోతుగా పాతుకొన్న శోకక్షోభలు పెకలి పొంగినప్పుడు ఆ యుద్వేగములో పదే పదే ప్రమాదకారణము లుండునని శంకింతును. అందువలన భగవతీ గౌతమీ! రామభద్రునిపట్ల నీవు మెలకువతో నుండుట మంచిది. కాబట్టి ....

బిసకెసలయ గంధములయి.
ప్రసన్న శిశిరజలశీ కరములను అలసా
లసవీచీపవనములన్
విసరి, తొలుపు మతము తూలి విడిగెడు వేళన్"

తమస : దాక్షిణ్యమామె స్నేహామునకు తగినదే. అపుగాక - రామ భద్రుని అపాయమునకు సంజీవనివంటి ఉపాయము మా కిప్పుడు సంనిహితంగా ఉన్నదిదే. -

మురళి : అది యెట్టిది ?

తమస : సఖి: ఆనాడు లక్ష్మణుడు వాల్మీకి తపోవనము ముందు సీతను విడిచిపెట్టివెళ్లెనుగదా. అంతట సీతాదేవికి ప్రసవవేదన ప్రారంభ మాయెను. ఆ బాధావేగము సాగలేక ఆమె గంగలో దూకెను. అందే ఇద్దరు బిడ్డలు పుట్టిరి. అప్పుడు పృథివీ భాగీరథీ దేవతలిరువు రును ఆ శిశువుల ననుగ్రహించి ఆమెను రసాతలమునకు కొని పోయిరి .... పిమ్మట .... పాలు విడువగానే ఆ శిశువులను స్వయ ముగా ఎత్తికొనిపోయి గంగాదేవి వాల్మీకి మహర్షి కప్పగించెను.

మురళి : (విస్మయముతో)

ఇట్టివారి యున్నంగటు వృత్తికగతుల
యందును ఘటిల్లెడిని పరమాద్భుతములు -
ఎచట ఉపకరణీభావ మెసగు నచట
అపతరించు నీలాటి దివ్యాభిజనము.

తమస : తరువాత .... శంబూక వధనిమిత్తముగా రామభద్రుడు జనస్థానమునకు వచ్చినాడని, సరయూముఖమున భగవతి భాగీరథి వినెను. అంతట, ఆమెకూడ స్నేహావశమై భగవతి లోపాముద్ర

వలెనే శంకించెను. కొంత ఆలోచించెను. పిదప ఏదో గ్రహశాంతి పేరుపెట్టి సీతాదేవిని వెంటబెట్టుకొని గోదావరీదేవిని దర్శింప వచ్చి యున్నది.

మురళ : ఎంతో బాగున్నది భగవతి ఆలోచన. ఎందుకంటే ........ రాజధానియందున్నప్పుడు రామభద్రుని చిత్తము ప్రజా క్షేమంకర కార్యములలో నిక్షిప్తమై యుండును. కాని నిర్వ్యాపారమతియై శోకమే రెండవ తోడుగా పంచవటిని ప్రవేశించుట అంతులేని అనర్థములకు కారణము కాకపోదు .... అయితే సరేకాని .... సీతా సహాయంగా రామభద్రుని ఊరడించుట ఎట్లు సాధ్యమో నాకు తోచుట లేదు.

తమస : ఆ విషయముకూడ భాగీరథీదేవియే ఇట్లు ఎక్కాటించినది.

"వత్సా ! సీతా ! ఆయుష్మంతులు కుశలవులకు నేడు పుట్టిన దినము. పన్నెండవయేడు, సంఖ్యామంగళ గ్రంథిని కట్టవలెను. అందుకు నీవు ముందుగా సవితృదేవతను పూజింప తగును. ఆమహా నీయుడు నీకు మొదటి మామగారు. ఈ మానవ రాజర్షి వంశమునకు మూలపురుషుడు, పాపధ్వంసి. అందుచే నీవు స్వహస్తములతో కోసిన కుసుమములతో ఆ దేవునకు అరాధన సల్పుము. ఈ నిమిత్త ముగా నీవు భూమిమీద సంచరింప వలసియున్నది. ఐనను మాప్రభావము వలన వనదేవతలు సైతము నిన్నుచూడ లేరు. ఇక మనుష్యులమాట చెప్పనేల ...." అటుపిమ్మట నన్నుకూడా దేవి ఇట్లాజ్ఞాపించినది. "తమసా! మా కోడలు - వత్స - జానకి నిన్ను మిక్కిలి ప్రేమించును. అందువలన నీవే ఆమెకు సహచారిణివై అనువర్తింపుము." అని. కావున మురళా ! నేనిప్పుడు తల్లిచెప్పినట్లు నడుచు కోవలెను....

మురళ : నేనుకూడ ఈవృత్తాంతమును భగవతిలోపాముద్రకు నివేదింతును. ఇంతలో ... రామభద్రుడును ఇటు రావచ్చును.

తమస : మురళా ! అదిగో ఆమె గోదావరీ జలములనుండి వెలువడి ....

వెలువెక్కి క్రమ్మించిన గండపాళితో
జడవీడి కురుల్ చెదరంగ మోమునన్
విరహావ్యథరూపమొ 'శోకమూర్తియో'
యన జానకి వచ్చునిదే వనానికిన్.

మురళ : ఆమేనా - ఇది ....

వాడిమెన్ లవింప పసివాడిన మొగ్గ పగిదిని
హృదయ ప్రసూనము విరఁబడ; శోకతపనల్
దహించుచు - సన్నగిలి - పాలిన - యామె తనువుల్:
శరదాష్మకంబు మృదుకేతకిరేకును బోలెన్.

[ అటునిటు పరిక్రమించి - ఇరువురును నిష్క్రమింతురు. ]

శుద్ధ విష్కంభమ్

నేపథ్యమున

ప్రమాదము - ప్రమాదము

[ పూలుకోయుచు ప్రవేశించిన సీత కుతూహలౌత్సుక్యములతో ఆలకించును ]

సీత : ఆ.... ఎఱుగుదును. అది-నా-ప్రియసఖి వాసంతి కంఠస్వరము ....

(నేపథ్యమున మఱల)

సీతాస్వహస్తమున అందుగు లేత జిగురు
లఁడీసి మున్ను తిని తేలిన కోడెయేన్గు.

సీత : అయితే - దానికేమయింది ?

(తిరిగి నేపథ్యమున)

నీరాడుచుండ సఖితో చలమెత్తి పెనగ
మాతంగ మొక్కటి ఉదగ్రమదాన కవిసె.

సీత : (రభసతో కొన్ని అడుగులు అటునిటు నడచి)

ఆర్యపుత్రా ! ఆర్యపుత్ర ! రక్షింపుము – నాపుత్రకుని రక్షింపుము ....

(ఆలోచించుచు)

ఎంత మంచి నాస్యరాలనో ! బహుకాలబద్ధ పరిచయములైనా – అవే – అక్షరములు నన్ను వదలక – మొదలి ఈ పంచవటీ దర్శనమున స్మరణకు వచ్చుచున్నవి. ఆర్యపుత్రా – అయ్యో ....

(మూర్ఛిల్లును)

తమస : అయి – ప్రియసఖీ ఏమిటిది ? ఊరడిల్లుము–ఓపికవహింపుము.

(నేపథ్యమున)

విమానరాజమా ! ఆగుము – మొదట ఇక్కడనే – ఆగుము

సీత : (తెలివితెచ్చుకొని – భయఉల్లాసములతో)

అహో ! ఏమిటీ ఎక్కడనుంచి వచ్చెనో తెలియదు. నీళ్ళమబ్బుల నుంచి విదాన నిస్వానములాగా—గంభీరజృంభణంగా—వినిపించింది ఈ భాషాపంక్తి. అంతేకాదు. అభాగ్యనైన నా వీనులు తాకి ఝుడితి చకితను చేసినది.

తమస : (చిఱునవ్వుతో) ఓసీ ! పసిదానా !

అపరిస్ఫుట – మేదో – ఆ
లపనము — తెలియ దెచటణా వెడలెనో ! ఇటులు
ఏక్కపడి సముత్కంఠవయితి
వి పిధాన స్తనిత చకిత యగు నెమిలివలెణా.

సీత : భగవతీ ! ఏమంటివి ! .... అపరిస్ఫుటమా .... ? ఆ - (తిరిగీ ఆ కంఠస్వరసరళిని ఆకళించుకొని) ఆర్యపుత్రుడే పల్కుచున్నాడని అనవాలు పట్టితిని.

తమస : ఆ .... విన్నాము .... తపస్సు చేయుచున్నాడట ఒకశూద్రుడు. ఆతని దండనార్థముగా - ఇక్ష్వాకుకులీనుడైనరాజు దండకకు వచ్చినాడని.

సీత : అవును. పరిహరింపరాని ధర్మవిధానము నెఱిగినవాడై యుండును. ఆ రాజు ....

(నేపథ్యమున)

ఎందే మృగాలును ద్రుమాలును బంధులయితి,
ఎందే వసించితి ప్రియాసహచారి నగుచు;
ఆగోత్ర కంధర ఝురీఝురధార లివియె
గోదావరీ పరిసరాద్రి తటాంతవనివియె

సీత : (చూపు సారించి) అయ్యో ! ఏమిది ? ఆ దుర్బలాకారము ఆర్యపుత్రుడే. వేకువజామున వెలవెల బోవు చందమామవలె నున్నాడు. గంభీరసౌమ్యములయిన ముఖ చిహ్నములచేత మాత్రమే ఆయనను గుర్తింప గలుగుచున్నాను. నిజంగా - ఆర్యపుత్రుడే .... భగవతీ ! నన్ను పట్టుకో .... (తమసను కౌగిలించికొని మూర్ఛిల్లును)

తమస : (సీతను పట్టుకొని) బిడ్డా ! భీతిల్లకు. ఊరడిల్లు ..........

(నేపథ్యమున)

ఈ పంచవటీ దర్శనమువలన .... .... ....

ఉగ్రముగ నిప్పుడు జ్వలింపనున్న అంత
రాళలీన శోకానల జ్వాలికలకు,
ముందు ముప్పిరిగొను ధూమపుంజమట్లు
గాఢ మూర్ఛాభరము నన్ను కప్పుమొదల.

హా ! ప్రియా జానకీ !

తమస : (తనలో) పెద్దలు ఈలాటి విపత్తునే శంకించిరి.

సీత : (తెలివి రాగా) ఆ - హా - ఏమిది ?

(మరల నేపథ్యమున)

హా దేవీ ! దండకారణ్య సహచారిణీ ! విదేహ రాజపుత్రీ !
(మూర్ఛిల్లును)

సీత : కటాకటా ! నష్టభాగ్యను నన్ను పిలుచుచు - నల్ల కలువలవంటి నేత్రములు తేలవేసి - నా నాథుడు మూర్ఛిల్లెను. కష్టమ్ ! నిట్టూర్పులు సారించుచు - నిష్ప్రహుడై - నిలుపలేక - నేలమీద పడిపోయినాడు. హా-హా-ఇది విపర్యాసము. భగవతీ ! కాపాడుము-కాపాడుము. ఆర్యపుత్రుని బ్రతికింపుము. (అని కాళ్ళమీద పడును)

తమస : ప్రాణములు పోయగలవు కళ్యాణి ! నీదు
పాణి సంస్పర్శమున జగత్పతికి నిపుడు,
అతని నిరతప్రియ స్థానమదియ కాన
నియతముగు నచ్చటనె జీవనీయ మహిమ.

సీత : కావలసినది కానిమ్ము (ఏమైనను సరే)
భగవతి ఆజ్ఞాపించిన ట్లే.... (సంభ్రమముతో నిష్క్రమించును)
[నేలమీద మూర్ఛిల్లిన రాముడు-కన్నీళ్లురాలగా సీత కరస్పర్శముతో ప్రవేశము.

రామ: (ఆహ్లాదించినట్లు ఉచ్ఛ్వాసించును)

సీత : (ఇంచుక హర్షించి - తనలో) త్రిలోకముల కంతకును జీవితము తిరిగి వచ్చినది.

రామ: హంత ! ఏమిది ? అహో ?

శ్రీచందనద్రుమకిసాలము చేరి నూరి,
చంద్రాంశు కందళరసంబులు పెండి తేర్చి,
సంతప్తమైన హృదయంబున పూసినారొ.
శుష్కించు జీవతరువుం దడిపించినారొ.

మఱియును....

చిరపరిచిత మీ స్పర్శము-
మరలించును ప్రాణముల - తెపల్బుగ మూర్ఛన్-
పరితాపము తీర్చును - క్ర
మ్మఱ - ఆనందజటిల జడిమం పదత్రోయున్.

సీత : ( భయశోకములతో - ఇంచుక ఒదిగి నిలిచి, ) అమ్మయ్యో - ఇప్పటి కిదే నాకు - బహుళమైన బహుమానము.

రామ: (లేచి కూర్చుండి) ఏమీ - నా దేవి - వత్సల - సీత - ఆమె - నాకు - ఇప్పుడు - ఈ ప్రకారము - ఉపచారము చేయలేదా ? ....

సీత : అయ్యో ! ఇదేమిటి-ఇక్కడనే ఉన్నాను. ఆర్యపుత్రుడు నన్ను వెదకునా యేమి ?

రామ: కానిమ్ము....పరికించి చూతును.

సీత : భగవతీ! తమసా ! రా....రా.... తొందరగా రా-తొలగిపోదము. ఇంతలో నేను కంట పడితినా .... సెలవు లేక సమీపించుటకు ఈ మహారాజు మిక్కిలి ఆగ్రహించును.

తమస : అయి ! కుమారీ ! భాగీరథీపరప్రసాదమువలన నీవు వనదేవత లకుకూడా కనబడవు. (ఎందుకీ భయమ్)

సీత : ఎఱుగుదును. ఆ ప్రభావ మటువంటిదే.

రామ : ఔను - ప్రియా ! జానకీ !

సీత : (శోకగద్గదమైన కంఠముతో) ఆర్యపుత్రా : నీ యీ పిలుపు నా యీ దశలో ఉచితంగా ధ్వనించుటలేదు. (ఏడ్చుచు) ఇస్సీ, నా హృదయము పాషాణమై పోయినదా! ఇంకొక జన్మలో నైనను సంభవము కానిది ఈయన దర్శనము. అట్టియెడ అభాగ్యనైన నన్ను వత్సలా ! యని పిలిచిన ఆర్యపుత్రుని పట్ల నాకు కనికరము లేక పోయినది .... ! నేను ఆయన హృదయము నెఱుగుదును — ఆయన నా హృదయము నెఱుగును :

రామ : ( అంతటను పరకాయించి, నిరాశతో ) అక్కటా ! ఇక్కడ ఏమియును లేదు........

సీత : భగవతీ ! అప్పుడు, అట్లు-అకారణంగా విసర్జించినాడు-ఇప్పుడు ఇట్లు ఈ ప్రకారంగా - అగపడుచున్నాడు. ఆహా ! నా హృదయానుబంధ మెట్టిదో నేనే తెలిసికోలేకున్నాను.

తమ : ఎఱుగుదును వత్సా ! ఎఱుగుదును.

ఆసలన్నియు పో నుదాసీనతకా నుడిసి -
నిష్కారణ కఠోరనికృతికిగా కలుషించి -
దీర్ఘమయిన వియోగ దీసదుస్తర దశను
ఆకస్మిక సమాగమాపత్తికి జడించి
సహజసౌజన్య ప్రసన్నతకా విలుపోపి
విభుని రోదనకు విలవిలలాడి తెగ నేడ్చి -

ప్రేమోదయముతో దర్శించు నీ క్షణమందు
నీదు హృదయంబు - అన్నియు నేకమైనట్లు ....

రామ : దేవీ !

రూపుతాల్చిన పరిణయస్వరూపము వలె
నీ కరస్పర్శ మిప్పు డార్ద్రీకరించు
నన్ను - స్నేహార్ద్ర శిశిరప్రసన్నముగను -
ఎందు గలవో ! కానబడ వానందమయిత్రి.

సీత : బిగ్గఱగా ధ్వనించుచున్నవి ఆర్యపుత్రుని ఆలాపములు. వానిలో ఆయన స్నేహభారము తెల్లమై, ఆనందము చిందుచున్నది....వీనిని ఆలకించినప్పుడు, ఆనాటి అకారణ విసర్జనము - శల్యమువలె - లోన నాటియున్నను నా జన్మము కృతార్థమనియే భావించుచున్నాను.

రామ : ఇంకా - నా ప్రాణప్రియ - ఎక్కడ ? —— ఇది రాముని భ్రమ. నిరంతర చింతనచే కలిగిన తన్మయావస్థానము కావలె .... ....

( నేపథ్యమున )

సీతా స్వహస్తమున అందుసులేతచిగురు
లఱతీసి మున్ను తిని తేలిన కోడె యేస్గు.

(ఈ పాదములు చదువబడును)

రామ : అయితే ? దాని కేమయినదీ ....

( మఱల నేపథ్యమందే )

నీరాడుచుండ ప్రియతో - చలమెత్తి పెనగ
మాతంగ మొక్కటి ఉదగ్రమదాన కవిసె.

(రెండుపాదములు చదువబడును)

సీత : (స్వగతమ్) అయితే దాని నిప్పుడు ఎవరు రక్షింతురు ?

రామ : ఆ....ఎక్కడ ? నా ప్రియురాలి పెంపుడు పుత్రుని-సఖీస మేతుని మీద పడిన దురాత్ముడెక్కడ ? (అని లేచి నిలుచును)

[వాసంతి ప్రవేశించును]

వాసం : ఏమిదీ ! దేవర రఘునందనుడా ?

సీత : ఇది యెట్లు ? ఈమె నా ప్రియసఖి వాసంతి....

వాసం : జయము జయము.

రామ : (నిరూపించుకొని) ఎలాగూ ! దేవీ ప్రియసఖి - వాసంతియా ?

వాసం : దేవా ! త్వరపడుము - త్వరపడుము. ఇదే జటాయు శిఖరము. అదిగో దానికి దక్షిణముగా సీతాతీర్థము అచ్చట గోదావరిని దాటి దేవీపుత్రకుని కాపాడుము.

సీత : తండ్రీ ! జటాయూ ! నీవు లేక యీ జనస్థాన మిప్పుడు శూన్యమైపోయినది.

రామ : అహ్హా ! ఈ కథాకథనము హృదయమర్మ పేటికలను కోసివేయు చున్నది.

వాసం : దేవా ! ఇటు — ఈవైపు .... ....

సీత : భగవతీ ! వనదేవతలకు కూడ నేను కానవచ్చుటలేదు. ఇది నిజమా !

తమస : అమ్మాయీ ! నీ కెందుకీ సందేహమ్ము. వనదేవత లందఱిలో మహామహిమకు అధిష్ఠానము మందాకిని ....

సీత : అలాగయితే - మనము వీరి ననుసరింతము.

(ఇరువురును నడచుచున్నారు)

రామ: (గౌతమిని సమీపించి) భగవతీ! గోదావరీ! నీకునమస్కారము.

వాసం: (వ్రేలు చూపుచు) దేవా! సంతోషము అదిగో వధూవృతుడున్న దేవీవత్సలుడే జయించినాడు.

రామ: జయము. చిరంజీవికి జయము.

సీత: ఇంతలోనే ఇంతవాడైనాడు.

రామ: దేవీ! నీయదృష్టము గొప్పది.

నీ చెవినున్న పల్లవము స్నిగ్ధబిసాంకుర ముగ్ధదంతముల్
సోకి గ్రహించె బిడ్డవలె చక్కనయాటకు — నే డతండు సం
కోచము లేక గంధగజకూటముపై బడ, పోరి గెల్వగా
చూచితి — నీ వయస్తరుణ శోభనభాజన మెంత పుణ్యమో.

సీత: బాగు — ఇక డిల్లే తన సుందరితో — ఎడబా టెఱుగక — చిరాయు వగుగాక.

రామ: సఖీ! వాసంతీ! చూడు — చూడు. ఈ వత్సలుడు కాంతాను వర్తనమందు కుశలుడైనాడు.

జలజసుగంధతోయము లోనంగను పుక్కిట నించి — పిలగా
నెలగిన తమ్మితూండ్లు కయిసేయు ప్రియకరిణికిన్ గ్రసింపగా —
చిలుకు కరంబుతో శిశిరశీకరమౌక్తిక సేరముల్ — తుదిన్
నిలుపు — నలోలబాల నలినీదలపత్రము ఛత్రభంగిమన్.

సీత: భగవతీ! ఇంతటిదైనది. ఇప్పటికి కుశలవు లెంతవారయిరో. తెలియలేకున్నాను.

తమ: వారునూ దీనియంత వారై యుందురు.

సీత: అదృష్టము చాలని నా జీవితమిట్లున్నది. ఒకవైపు ఆర్యపుత్ర వియోగము. మఱొకప్రక్క పుత్రవిరహము.

తప : అప్పుడు నీ భాగ్యమట్టిదే....

సీత : తల్లీ ! నేను బిడ్డలను కన్న ప్రయోజనమేమి? ఇంతింత ఎడము లయిన పలువరుసతో, మిసమిస లాడు చెక్కిళ్ళతో — లలిత లలిత మయిన లావణ్యముతో - బిగియకట్టిన కాంత కుంతలములతో .... నిండార విచ్చిన తెల్ల తామర పువ్వుల వలె - ఉజ్జ్వలములై - ఉల్లాస దరహాసము లైన — ఆ యిద్దరి ముద్దు మోములనూ ఆర్యపుత్రుడు ముద్దాడి యెఱుగడు గదా !

తమ : కుమారీ ! కులదేవతల ప్రసాదమున అదియును సిద్ధించును.

సీత : భగవతీ ! ఇట్లు కన్న బిడ్డల కథ స్మరణకు వచ్చుటచే - నా రొమ్ములు - చేపి - పాలు కాఱుచున్నవి. అందువలన వారి జనకుల సంనిధానమందు క్షణమాత్రము బిడ్డలతల్లినైతిని.

తమ : ఏమి టీ సంభాషణ ? ఎఱుగవో ! స్నేహమునకు ప్రసవమే ఆ సీమాంతఫలమ్. అదే పితరులను అన్యోన్యము అవినాభావముగా సంధానించు పరమానుబంధము.

తరుణీతరుణుల అంతః
కరణస్నేహ మగు నీ యఖండానందా
వరణగ్రంథి - నపత్యా
భరణ మనిరి తాత్వికులు సుపర్వసవిత్రీ !

వాసం: దేవా ! ఈ దిక్కున తిలకింపుము

ఆ.... శిఖండి సమయ మనక మదపదభంగి
తాండవోత్సవమును తానై నివర్తించి
క్రొత్త పింఛమునెత్తి కులుకుచు సఖితోడ
కూయు కడిమిమీద - కురువిందమకుటమై.

సీత : (కౌతుకముతో కన్నీరు జాఱగా) ఓహో! అదే....ఇది.

రామ : వత్సా! ఉల్లసిల్లుము. నేడు మేము సుప్రీతులమైతిమి.

సీత : అట్లే అగుచుగాక.

రామ : కనులు తిరుగ సంభ్రమగా - భ్రమీస్వృత్తగతి
సులభ చలనభంగి - చోదింప భ్రూనటన
ముగుద కఱపె నాట్యముగా - పాణితాళముల
ప్రియసుతుగావలెను - స్మరింతుగా గదోయి శిఖి!
హా! విధీ! తిర్యక్సంతానము పైతము స్నేహపథము నంటియే వర్తించుచున్నది.
కతిపయ సుమగుచ్ఛములను
కుతుకము నిడు ఈ కడిమిని
అతి మమతను నా ప్రియసఖి
సుతుని పగిది సాకిన యది....

సీత : (కన్నీళ్ళతో) నిజమ్. ఆర్యపుత్రుడు చక్కగా గుర్తించినాడు.

రామ : స్మరియించును దేవియు నీ
గిరిశిఖి నభిజనమున ట్లఖిల వత్సలతన్.

వాసం: దేవా! నీ వించుక కూర్చుండుము.

రామ : (కూర్చుండును)

వాసం: అరటిచెట్ల నడుమ అల్లదే పాషాణ
ఫలక - మపుడు-నీకు పాన్పయ్యె ప్రియతోడ
అందె యుండి సీత అందించె పచ్చికలు
హరిణములకు - దాన - నటుపాయ విప్పుడివి.

రామ : ఇది చూచుటకు శక్యముగాదు — నాకు — (అని తేచి వే రొకచో కూర్చుండును.)

సీత : సఖీ! వాసంతీ! ఇలాటి దృశ్యములను చూపి నా ఆర్యపుత్రు నేమిచేసినావే? ఎందుకిది? అకటా! ఆనాటి ఆర్యపుత్రుడే ఇతడు. పంచవటీవనమును అదే! ఆ ప్రియసఖి వాసంతియును ఇదే! సకల సరససఖ్యములకును సాక్షి లయిన గోదావరీ గహనమందున్న మిట్టలును అవే! ఇంకను బిడ్డలవలె మెలగిన ఆ పశుపక్షి వృక్షవీథులును ఇవే! కాని - నేను మందభాగ్యను. కనులార చూచుచున్నను ఇవి లేనట్లే ఉన్నది నాకు - ఆహా! జీవలోకపరివర్తన మిట్టిదేనా!

వాసం : సఖీ! సీతా! ఏమిటిది? రాముని అవస్థను చూడవా ....

కలువలు బోని మేని నునుకాంతులు నీ కనువిందొనర్ప, చెం
తల కనువారికే నమచినస్ఫుటమంగళ నూత్నమూర్తియై
విలసిలు రాము డిప్పుడు తపించి కృశించి వియోగదుర్వ్యథన్
సొలసియు పాలి నల్లబడి శోభిలు నైనను దర్శనీయుడై.

సీత : చూచుచున్నాను! చూస్తూనే ఉన్నాను.

తమ : చూడుము. బిడ్డా! ప్రియుని చూతువుగాక. బాగా పరికింతువు గాక!

సీత : ఆహా! సుభ్వషీ! నన్ను బాసి అతడు - అతని యెడబాసి నేను - ఇట్టి ఇక్కట్లు సంభవమని ఎవ్వరేని ఊహించిరా? ఆర్యపుత్రుని ఈ దర్శనము - జన్మాంతరాయాతమువలె - ప్రాసుమీది ముల్లువలె సున్నితంగా నుంత నిలిచింది. ఐనను చూతును - కన్నీళ్ళు పొడిచి-విడుచు సందులున్నవి గదా!

తమస : (కన్నీళ్ళతో సీతను కౌగిలించి).

ప్రియపరితృష్ణతో పెగిలి పీవరమై, చెలిమిఁ బొణంకుచున్,
రయమున నిండి-వేగమున రాలు-ప్రమోద విషాదబాష్పముల్
పయికొను హిమవృష్టి ధవళంబుగ పాయ పయస్తరంగిణీ
క్రియ, పులకంబు లార్చును సుఖింపగ నీ హృదయేశునియ్యెడన్.

వాసం: తనుపు లొసగుఁ బూవోసిళ్లఁ రసాల ఫలాలతో
విసరును వనివాతంబుల్ పద్మగంధభరంబులై
విహగకుల ముత్కంఠఁ బాడుఁ గషాయగళప్రతిన్
స్వయముగనె వేంచేయఁ శ్రీరాము డీ వనసీమకున్.

రామ : సఖీ ! వాసంతీ ! సివిచ్చట కూర్చుండుము.

వాసం : (శోకించుచు) మహారాజా ! లక్ష్మణకుమారులకు క్షేమమే గదా!

రామ : (విననట్లు అభినయించి),

పెనిచె ప్రియ చేయారఁ నీవారశాద్వలపయస్సులఁ
ఎదిగినవి యూపక్షుల్ సారంగముల్ తరులతావనుల్;
అణగకిపు డుద్వేగించుఁ దుర్వికార మెదలోపలన్
పెకలునటు చేదో పాషాణద్రవంబువలె వేడిమిన్.

వాసం : మహారాజా ! అడుగుచున్నాను లక్ష్మణకుమారులకు కుశలమా-అని.

రామ : (స్వగతమ్) మహారాజా — అని సంబోధించుచున్నది. ఇది కేవలమ్ స్నేహసిక్తముకాని ఆమంత్రణపదము. అదిగాక - ఒక్క-లక్ష్మణుని కుశలమును మాత్రమే అడుగుచున్నది. పైగా-ఆ యక్ష రములుకూడా కన్నీళ్ళతో తడబడి వెడలినవి. అందుచే, ఈమె సీతా వృత్తాంతమును విన్నదనియే భావింతును. (ప్రకాశముగా) ఆ-లక్ష్మణ కుమారుడు కుశలముగా ఉన్నాడు.

వాసం : అయ్యో ! ఎంతుకంత దారుణమే కావలసివచ్చినది.

సీత : చెలీ ! వాసంతీ ! ఏమి టీ వాదన ? ఆర్యపుత్రుడు అందఱికినీ పూజ్యుడు. విశేషించి నా సఖికి - వాసంతికి - నీకు ....

వాసం: "నీవే నా హృదయంబు - నాదు నయనేందీవర జ్యోత్స్నవు-
నీవే - రెండవ ప్రాణమీ - వొడలికిన్ పీయూషము-నీవ- నా
జీవాలంబన"మంచు మచ్చికల నచ్చింపుల్ శతంబాడి-హా
నా వైదేహి, నమాయికన్ తెగితి-శాంతమ్-పాప-మింకేమనన్.

(మూర్ఛిల్లును)

తమస : మాట రానప్పుడు మూర్ఛ ముసించుకొని వచ్చును .... ....
అనుగతమే ఇది.

రామ : సఖీ ! సహింపుము. సమాధానము వహింపుము.

వాసం : ( తెలివి తెచ్చుకొని ) దేవరవారీ అకార్యమును ఎందు కాచరించిరి ?

సీత : నెచ్చెలీ ! వాసంతీ ! చాలించు - ఇంక చాలించు నీ .... ....

రామ : ఆవల .... లోకజనము సహింపలేకపోయినది .... అని ....

వాసం: అందుకు హేతువు ....

రామ : ఏల ! అది లోకమునకే తెలియును.

తమ : ఆ-ఈ యూఱు దీర్ఘకాలమునాటిదే.

వాసం: ఓయి కఠోర ! యశస్సొక
టే యుష్మదభీష్టము: కలదే దుష్కీర్తి
చ్ఛాయ మఱొకటి ? తెలుపు మే
మాయె నడవి నా హరిణనయన ? ఏమనెదో ....

సీత : సఖీ ! ఏవే కఠోరవు — కటికదానవు. మఱుగుచున్న దానిని మండించుచున్నావు....

తమ : విద్దా ! స్నేహశోకముల వైఖరి యిదే సుమీ !

రామ : సఖీ ! అనుటకు ఏమున్నది ?

(తనలో - ఏమని ఊహించును)

ఏడాది వేడిపడె విత్తరపోవు కనుల —
నిండారు చూలున భరాలసమైన నడల —
వేచూడవంటి తెలి వెన్నెల తీగె నామె
క్రవ్యాదముల్ నమలియుండును-నిశ్చయంబు —

సీత : ఆర్యపుత్ర ! నే నిక్కడ సజీవంగా ఉన్నాను.

రామ : హా ! ప్రియా ! జానకీ ఎక్కడ ఉన్నావు ....

సీత : ఇస్సీ ! ఆర్యపుత్రుడు కంఠము విప్పి ఆక్రందించుచున్నాడే....

తమ ; వత్సా ! ఇది సరిగానే ఉన్నది. దుఃఖదష్టులకు దుఃఖించినపుడే స్తిమితము కలుగును.

గట్లు తన్ని లోణకు కాసారమునకున్న
కలుజుతీయ పొంగు వెలికి పోవు -
శోకదుర్భరమున క్షోభించు హృదయంబు
కొంసరి యేడ్చి పిదప కుదుట పడును.

అంచును - ఇది రామునిపట్ల మిక్కిలి నిక్కము. ఎందుకంటే - ఆతని జీవితము ఈ లోకములో బహుప్రకారముల కష్టజుష్టమై కక్కసమైపోయినది. ఇతనికి....

పరిపాలింపగ తగ్గ దీక్షవి మనఃస్వాస్థ్యంబుతో ప్రాగ్విధిన్ ;
తరుణీతాపము జీవపుష్పమును చండగ్రీష్మమ ట్లేర్చు ! దు
స్తరమాయెన్ విలపింపగా స్వయము కాంతాత్యాగమున్‌చేసి; ఊ
పిరితో నే డిటు లేడ్చి తత్ప్రశమనంబున్ పొంద లాభంబగున్.

రామ : కష్టమ్. ఇది అత్యంత కష్టమ్ -

హృది శిథిలమాయెన్ దుర్వేగాహతిన్ పిడక రెండుగా,
ఒడలు భరియించున్ వైకల్యంబు - మూర్ఛిలదు చేతమున్,
వపువును దహించు నంతర్దాహంబు భస్మముగ కాల్పకే,
విధియు ప్రహరించుజా మర్మాలంటి త్రెంపకయె ప్రాణముల్.

సీత : నేనుకూడ ఆలాటి యాతనలోనే ఉన్నాను.

రామ : ఓహో ! పౌరజాన పదులారా !

అభిమతముకాదాయెజా దేవీ గృహాంతర నివాసమే,
విడిచితి తృణంబట్టుల్ శూన్యాటవిజా వగవ కింతయున్,
చిర పరిచయ స్నేహావిర్భావముల్ భ్రమల ముంచెడిన్,
అశరణుడనై శోకింతుజా నేడు మీరు కరుణింపుడీ !

తమస : కటా ! శోక సముద్రములోపలి సుడిగుండములు అతీతమ్ లోతైనవి.

వాసంతి : దేవా ! గతించినది తిరిగి రాదుగదా ! ధైర్య మవలంబింప తగును.

రామ : సఖీ ! ఏమంటివి ! ధైర్యమా ....

పదిరెండేండ్లు గతించెను
విదేహసుతలేని యాన్య విశ్వమున - ధ్వనిం
పను సీతాపదమైననూ -
ప్రసుకక పోలేదు - చాక - రాముడు ధరలో ....

సీత : ఆర్యపుత్రుని మాటలతో నాకు మూర్ఛ ముంచుకొని వస్తున్నది.

తమస : వత్సా! అది అలాటిదే సుమీ!
పడిసి స్నేహాన - శోకాన నుడికి వెడలు
ప్రియతమాలాపములు కావివి శుభగాత్రి!
విసము కలిసిన పేడితుంపిళ్లు వాడి
ధారలై నీపయిఁ బారు దారుణముగ.

రామ : అయి - వాసంతీ! ధైర్యములేదా నాకు
గుండె కష్టంబుగా గ్రుచ్చుక పెడబడి
కెరలి మెలమెలలాడు కొలవి మాద్రి,
అంతస్సులో నాటి యాతనలెత్త ఆ
రాటపెట్టు విసంగవుకాటు పగిది,
హృదయ మర్మములను తీవరించి కొటికి
త్రెంచు శోకమును భరించలేదె?

సీత : అవును. మాటిమాటికీ — ఆర్యపుత్రుని ఆయాసపెట్టుచున్న అభాగ్యురాలను నేనే ....

రామ : అకటా! నేనో నిరుత్సాహి నైతిని - నిష్కంపంగా అంతఃకరణము స్తంభించి పోయింది. ఐనా - బహు పరిచయ భరితములైన ఈ జీవద్వస్తు పరిసరమును చూచినప్పుడు ఏదో ఉద్వేగము ఉబ్బితిల్లు చున్నది.

అతిలోలంబయి, క్షుబ్ధమైన విషయాత్యంతీన దుర్వేగమున్
ప్రతిరోధించితి నెట్టె రెట్టులు ప్రయత్నస్పర్థ - నట్టట్టు చే
క్షతమై అన్నియు ఛిన్నమై - ఒకబలాత్కారవ్యథావేగ ము
ప్పతిలున్ - కట్టలు త్రెంచు అప్రతిరయాపః ప్రాంశురాశిక్రియన్

సీత : ఆర్యపుత్రుడు దారుణ దుఃఖముతో క్షోభిల్లుచున్నాడు. అది అపర కున్నది. దానితోబాటు నా హృదయముకూడా ఆత్మశోకమునపః రంపించుచున్నది.

వాసంతి : (తనలో) ఈయన తీవ్రాపత్తులో పడినాడు. ఇంచుక విక్షేపము కల్పించి మరలింతును (ప్రకాశముగా) దేవా ! దీర్ఘపరిచితము లయిన ఈ జనస్థాన భాగములవైపు తిరిగి చూడుడు.

రామ : అలాగే, (అని లేచి పరిక్రమించును)

సీత : అయ్యో ! ఇదేమిటి ? ఏవి దుఃఖదీపనములో వానినే దుఃఖాః నోదములుగా నాసఖి భ్రాంతిపడు చున్నది.

వాసంతి : (సకరుణముగా) దేవా !

స్రోవము చూచు చీలతల తోరణవాటిక నుండ నీవు, గో
దావరి పై కతంబుల ముదంబున అంచలయాట గాంచుచున్
దేవి విలంబయై యచటఁ దెంచి వృథా విమనస్కుని బోలె నున్న నీ
భావ మెఱింగి, మోడ్చె కరపల్లవపాళి క్షమార్పణాంజలిన్,

సీత : కఠినవే ! వాసంతీ ! నీవు నిష్ఠురకఠోరవు. మనోమర్మ కర్కశ ములైన గాఢఘట్టనలతో మాటిమాటికీ మంద భాగ్యనయిన నన్నా- ఆర్యపుత్రునీ కక్కుస పెట్టుచున్నావు.

రామ : చండీ ! జానకీ ! నీవు ఇక్కడా - అక్కడా ఉన్నట్లు మాత్రం అగపడుదువు; కాని జాలి చూపలేవా ?

దేవీ ! నాహృదయంబు ప్రీలె, తెగె సంధిస్కంధ దేహాంగముల్,
పాపజ్వాలలలోన కాలుదును - శూన్యంబాయె లోకంబులున్,
జీవాంతఃకరణ ప్రసారములు పెంజీకట్లి స్తంభించె: నా
పోవన్ దక్కెను చేయలేక యెదియున్ మూర్ఛిల్లి యేకాకినై.

సీత : అయ్యో ! ఆర్యపుత్రుడు మఱల మూర్ఛపోయినాడు.

వాసంతి : దేవా ! ఊరడిల్లుము ఊరడిల్లుము.

సీత : హా ! ఆర్యపుత్ర ! అదృష్టము చాలని దానను నేను. అశేష జీవలోకమునకును ఆధారము నీజన్మభాగ. అట్టినీకు నా నిమిత్తముగా, పదే పదే జీవితసంశయమగు దారుణదశ దాపరించుచున్నది .... హా - హతవిధీ.

(మూర్ఛిల్లును)

తమసః : బిడ్డా ! ఓపిక పూనుము — ఊపిరి చిక్కపట్టు — తిరిగీ .... నీ పాణిస్పర్శన మొక్కటే రామునికి జీవనోపాయము.

వాసంతి : కష్టమ్. ఏమి చేయను.... ఈయన కింకను ఊపిరి రాలేదు. హా ! ప్రియసఖీ ! సీతా! నీవెక్కడ ఉన్నావో నీ జీవితేశ్వరుని సంనిధానమునకు రమ్మి.

సీత : (సంభ్రమముతో సమీపించి రాముని హృదయలలాట స్థానములను స్పృశించును)

వాసంతి : అమ్మయ్యా ! రామభద్రుడు మఱల తేఱుకొన్నాడు.

రామ: అమృతవిలేపనంబు బహిరంతర ధాతుశరీర మంతటన్
నిమిరినయట్లు సోకినది నిర్మలమై యొకస్పర్శన ప్రసా
రము, సుడివోయి శోషిలినప్రాణము తేఱి ప్రమోద మందె - కా
ని మఱల ఖేదపెట్టెడిని నిల్పగజాలని మూర్ఛనావిధుల్.

(ఆనందముతోకన్ను లుమూసికొనియే, సఖి! వాసంతి! ఆ-ఎంతటిభాగ్యమ్)

వాసంతి : దేవా ! ఏమిది.

రామ : సఖీ ! మరేమున్నదీ - మరల జానకి దొరికినది ....

వాసంతి : అయి దేవ ! ఏదీ ? ఎక్కడ ఉన్నది ?

రామ : (స్పర్శసుఖమును సూచించుచు) చూడు. ఇదే - నాముందే ....

వాసంతి : దేవా ! రామభద్ర ! ఏమిటిది ? ప్రియసఖీ విపద్విషాదము తోనే దగ్ధమై పోతున్నాను. పైగా - నీ ప్రలాపములు దారుణంగా అంతరాంతరములను ఛేదించు చున్నవి.

సీత : ఇక్కడినుండి పోవలెననిపిస్తున్నది నాకు. అయితే చిరదారుణ మైన నా దీర్ఘసంతాపము క్షణములో ఆర్యపుత్రస్పర్శచే ఉపశమించింది. ఇంక - నా హస్తమో - వజ్రలేపముతో గట్టిగా బిగించినట్లుం పోయినను-చెమర్చి-అవశంగా-వదలిపోతున్నది. ఏమిచేయుదును...

రామ : సఖీ ! ప్రలాపము ఎందుకా నాది. ఎక్కడ ?

పరిణయమందు పట్టితిని పచ్చని తోరముతోడి హస్తముస్
ఎఱుగుదు దానిస్పర్శలు యథేచ్ఛ చిరంబు సుధాసుశీతమున్

సీత : ఆర్యపుత్ర ! అదే యిది. నీ వెఱుగుదువు.

రామ : ఆ .... ....

కర మిదె; తొల్కరింపు వడగండ్లవలెన్ తనియించుచున్ మ.
హారలవలీదలీ లలితమై లభియించెను నాకిదే యిటన్ ....

(అని పట్టుకొనును)

సీత : అయ్యో! ప్రమాదమయినది ఆర్యపుత్రునిస్పర్శవలన మోహంలో పడి ఏమరితిని....

రామ : సఖీ! వాసంతీ! ఆనందముతో స్తంభించినవి నా యింద్రియములు. భయమెత్తుచున్నది....నీవైనా పట్టుకో నన్ను....

వాసం : కష్టమ్. ఇది ఉన్మాదమే....(అని రాముని పట్టుకొనును)

సీత : (సంభ్రమముతో చేయి వదిలించుకొని పైతొలగును)

రామ : ఇస్సీ. ప్రమాదము-ప్రమాదమ్.

జలదరించి చెమర్చు సఖిపాణి పల్లవము
స్వేదించి కంపించు నాదు హస్తము నెడసి
జారిపోయినది సుకుమారముగ స్నిగ్ధమై,
జడమునుండి జడంబు ఝడితి విడబడినట్లు.

సీత : అకటా! ఆర్యపుత్రు డిప్పటికినీ కోలుకొనలేదు. ఈ వికలావస్థలో ఱెప్పలు వాలక ఆయన చూపులు సుళ్ళు తిరుగుచున్నవి.

తమస: (స్నేహకౌతుకములతో నవ్వుచు)

తన ప్రియుని స్పర్శసుఖమున తనిసి తనరి
వత్స చెమరించి పులకించి వణకిపోవు;
గాలి చిమ్మిన శిశిరజలాల తడిసి
కలయ విప్పారు మొగ్గల కడిమి వోలె.

సీత : స్వీయమైన అవినయముచేత తల్లివంటి తమసముందు నా సిగ్గు చితికినట్లయింది. ఆమె ఏమనుకొనునో....ఆ పరిత్యాగ మెక్కడ....ఈ హృదయాసంగ మెక్కడ?

రామ : (అంతటను కలయ చూచి) ఆహా! ఏమిటి ఇది. ఎచ్చటను లేదు. జాలిలేని ఓ జానకీ!

సీత : సత్యమే. నేను జాలిమాలిన దాననే. ఏమన-నిన్నీ దురవస్థలో చూచుచూ ప్రాణములతో నిలిచి ఉన్నాను.

రామ : ప్రియా ! ఎక్కడ ఉన్నావు. దేవీ ! ప్రసన్నురాలవుకావా ? నన్నీ దశలో విసర్జించుట తగునా ?

సీత : అయి. ఆర్యపుత్ర ! అట్లుకాదు. ఈ పలుకులు తారుమారయినవి. నిజానికి నీవే నన్ను విడనాడితివి.

వాసం : దేవా ! క్షమింపుము-క్షమింపుము. నీ శోకము చరమదశాంతములను తాకి-దాటి-పెరిగిపోయినది. దానిని లోకో_త్తరమైన నీ ఆత్మ ధైర్యముతో _స్తంభింపచేయుము .... ఆ .... నా ప్రియసఖి - ఇంకా-ఎక్కడ ....

రామ : స్పష్టమే; ఆమె లేదు. కానిచో ఆమెను వాసంతి కూడా చూడలేక పోవునా ? ఇది ఒక స్వప్నము కానోపు - అయితే నేను నిద్ర పోలేదే-ఆ-రామునికి నిద్ర యెక్కడిది ? లేదు. ఇది ఒక మతిభ్రమ. మరుపురాక - మాటిమాటికీ - స్మరణలో నిలిచిన బలవద్విప్రలంభ ధ్యానమే .... ఈలాటి మిథ్యాకల్పనలతో నన్ను వెన్నాడచుండవలెను.

సీత : అవును నామూలముగానే ఆర్యపుత్రుడు వంచితుడైనాడు.

వాసం : దేవా ! అటు చూడుడు....

ఇది పౌలస్త్యుని నల్లయుక్కు_రథ మింతింతై జటాయుచ్ఛిదా
చ్ఛదియై కూల, పిశాచవక్త్రవికృతాశ్వక్షీణకంకాళముల్
చెదరెన్-గృధ్రకులేంద్రు పక్షములు విక్షేపించి పైదేహితో
చద లెక్కన్ రిపు డిందె-గర్భితటిదుత్సంగాసితాభ్రంబటుల్.

సీత : ( భయముతో ) ఆర్యపుత్రా ! తాతను చంపుచున్నాడు. నన్ను అపహరించికొని పోవుచున్నాడు.

రామ : (వేగముతో లేచి) ఆ-పాపీ : తాతప్రాణసీతాపహారీ ! లంకాపతీ ! నీవెందు తప్పించుకొని పోగలవు.

వాసం : అయి. దేవ ! దైత్యకుల ధూమకేతూ ! ఇంకనూ ఎవరిమీద నీ కోపము....

సీత : నేను వెఱ్ఱిదాన నై పోతున్నాను.

రామ : ఔను - ప్రలాపమే నాది. ఈ ప్రలయము మునుపటిదానివంటిది కాదు. క్రొత్తది - మఱొక విధమైనది....

వివిధోపాయములన్ వ్యథాపనయ మన్వేషింప భావంబు - వీ
రవిహారోద్యమమర్దనాద్భుతములన్ రాగిల్ల లోకంబు - శా
త్రవ నిర్మూలము దాక నై చితిని ముగ్ధాచర్వియోగార్తి - నే
డవునే నై పగ నిష్క్రియానిరవధివ్యగ్రంబు నీ దుఃఖమున్.

సీత : ఆ-నిరవధి ? అంతమే లేదా ! హా ! అపహతనైతిని. మంద భాగ్యను. (ఏడ్చును)

రామ : కష్టమ్....

చెలి ! నీ వెచ్చట నుంటి వచ్చట ఉదాసించున్ కపిస్వామి ని
శ్చలసఖ్యంబు-ప్లవంగవీరుల ప్రతిష్ఠల్ నష్టమౌ-జాంబవం
తుల ప్రజ్ఞాప్రభ లస్తమించు-హనుమంతుండున్ పరిశ్రాంతుడౌ-
తలకున్ నీలుని నేర్పు-వమ్మగు సుమిత్రాపుత్రు వాలమ్ములున్.

సీత : సరే ! ఆనాటి నావియోగము కూడా మంచికే వచ్చినట్లయింది.

రామ: సఖీ ! వాసంతీ ! రామదర్శనము అతని ఆప్తులకిప్పుడు దుఃఖమే యగును—ఎంత దూరము నిన్ని ట్లేడిపింతును.... ఇక నన్ను పోనిమ్ము.

సీత : (ఉద్రిక్తమోహముతో తమసను కౌగలించుకొని) ఆర్యపుత్రుడు-ఇట్లు-ఈ యవస్థలో వెళ్ళిపోవునా ? ఎక్కడికి....(మూర్ఛిల్లును)

తమ : వత్సా ! తమాయించు - ఇంచుక తాలిమి తెచ్చుకో.... మనము కూడా ఆయుష్మంతులు — కుశలవులకు వర్షవర్ధనమంగళ మార్జింప వలసి యున్నది. కావున గోదావరీపార్శ్వ సమీపమునకే పోదము రమ్మా.

సీత : భగవతీ ! క్షమింపుము. ఈ దుర్లభమైన ఆర్యపుత్రుదర్శనము క్షణమాత్రము అనుభవింపనిమ్మా....

రామ : అగుగాక.... ఇప్పుడు అశ్వమేధమునకై నాకు సహధర్మచారిణి ఉన్నది గదా !

సీత : (వణకుచు) ఆర్యపుత్ర ! అది ఎవతె ?

వాసం: పెండ్లి చేసికొంటివా యేమి ?

రామ : నహి-నహి-సీతాదేవిప్రతిమ-హిరణ్మయమ్....

సీత : (ఇంచుక ఓర్పుతో - కన్నీరు కాఱగా)

ఆర్యపుత్ర ! నీవు నీవే ! అబ్బా - ఇంతకాలమునకు, నాడు నాటిన పరిత్యాగలజ్జాశల్యమును ఊడదీసితివి.

రామ : కానిమ్మా. ఆ - సీతా ప్రతిమను చూతును .... దానితో బాష్ప బాధితములైన నా కన్నులకు కొంత వినోదము కాగలదు.

సీత : నిజమ్. ఆర్యపుత్రుని మన్ననకెక్కిన ఆ ప్రతిమా మానవతి ధన్యురాలు. ఎందుకంటే, ఆయనను వినోదింపజేసి ఈ జీవలోకమున కంతకు ఆశలు పోసినదైనది.

తమస : (నవ్వుచు - స్నేహాశ్రువులతో సీతను కౌగిలించుకొని) వత్సా! నిన్ను నీవే పొగడుకొందువో ....

సీత : (సిగ్గుతో) భగవతిపరిహాసమునకే పాలయితిని ....

వాసంతి : దేవా! ఇప్పుడు - ఈచోట - నీరాకయే అనిచ్ఛా ప్రసాదమ్. ఇక నీవు వెళ్లవచ్చును. కార్యాంతర భంగము కాకూడదుగదా!

రామ : తథాస్తు ....

సీత : ఆహా! నాకీసమయమున సఖి వాసంతీప్రవృత్తమే ప్రతికూలముగా పరిణమించినది.

తమస : ఇక - బిడ్డా! మనము వెళ్లుదము - రా -

సీత : ఆజ్ఞే చేసెదములే ....

తమస: ఎట్లు - విడచిపెట్టి వెళ్ళగలవో ....

తృష్ణచే దీర్ఘ దీర్ఘ చారితము లయిన
నీదుచూపులు ప్రియునిపై నెలపు కొనుచు,
తెగి మరలిరావు బిడ్డ! యత్నింతు వెంత
ఏతదసుబంధమర్మము లెడపుటకును.

సీత : నమస్కారము - సాంగనమస్కారము .... బహుజన్మ సుకృత ఫలితముగా పుణ్యాత్ములకు మాత్రమే దర్శనయోగ్యమైన ఆర్యపుత్రుని చరణారవిందములకు నమస్కారము. (మూర్ఛిల్లును)

తమస ! పట్టీ! ఓపిక చిక్కపట్టుము.

సీత : (తెలివి తెచ్చుకొని) మలగిపోవు మబ్బుసందులలో పున్నమ చందమామను ఎంతదూరము చూడగలమ్ ?

తమస : ఆహా ! ఏమి ! రః సంవిధానకమ్

కరుణ యొక్కటియే రసస్మరణ కెక్క
భిన్న మట్టు లాశ్రయరతిఁ వేఱు వేఱు
వికృతు లయ్యు; బుద్బుదములై - వీచికలయి-
సుళ్లయి తిరిగి-తుది-పయస్సుగనె నిలుచు.

రామ : విమానరాజమా ! ఇటు - ఇటు. (అందఱు లేచి నిలుతురు)

తమసా :
వాసంతులు: } (సీతారాములపై పు చూచుచు)

మహియు-దివ్యవాహినియు—అస్మాదృశులును.
పుడమి ఛందస్సులను తొల్త నడిపినట్టి
కులపతి—అరుంధతీ వశిష్ఠులును-మునులు—
మిమ్ము దీవింత్రు నిఖిలశుభమ్ము లొదవ.

(అందఱును నిష్క్రమింతురు)
ఛాయానామ తృతీయాఙ్కమ్.



# చతుర్థాంకము

(ఇరువురు తాపస శిష్యులు ప్రవేశమ్)

ఒకడు : సౌధాతకీ! చూడు. ఈ దినము అతిథిజనము అధికాధికంగా వచ్చింది. వీరికోసము ప్రారంభమయిన సంనాహముతో భగవంతుని ఆశ్రమపదము ఎంతో రమణీయముగా ఉన్నది. అదిగో

లేడిబాలెంత క్రోలిన వేడిపాలు
రవ్వనిప్పారి గంజిని త్రాచు మృగము;
వేసబిండ్ల గుజ్జును కల్పి ఘృతముతోడ
శాకములు పాకమగు సువాసనలు సుడియు.

సౌధాతకి : స్వాగతముచెప్పుచున్నాను. రా .... ఈ ముసలి గడ్డాలకు - వచ్చేసినవారికి-రానున్న వారికీ - ఇంకా ఇతర పౌరులకూ - అందరికీ ఎందుకంటే వీరిరాకవలన మనకీదినము పాఠములేని ఆట విడుపయింది.

ప్రథమ : (నవ్వుచు) సౌధాతకీ! గురుజన స్వాగతమునకు నీవు వెతకిన కారణం అపూర్వంగా ఉన్నదోయ్.

సౌధా : ఓయీ! దాండాయనా! ఈవృద్ధనారీయూథానికి అధినాయకుడుగా నారచీరలుకట్టి వేంచేసిన ఆ అతిథి మహాత్ముని పేరేమిటి ?

దాండా : ఛీ - పరిహాసాలు కట్టిపెట్టు. ఆయన భగవాన్ వశిష్ఠుడు. ముందున్నది దేవి అరుంధతి. దశరథ మహారాజ ధర్మదారలను వెంటబెట్టుకొని ఋష్యశృంగాశ్రమమునుండి వచ్చేసినాడు. ఏమిటీ ప్రలాపము....

సౌధా : ఆహా ! వశిష్ఠుడా ? ఆయన ....

దాండా : అవును. ఏమి ! ....

సౌధా : మరేమీలేదు. వ్యాఘ్రమో తోడేలో అనుకొన్నాను నేను.

దాండా : ఏమంటివి ! ....

సౌధా : ఎందుకన్నానంటే - నాడు ఆయనవచ్చి రాకమునుపే — పాపమ్ నా ఆవుపెయ్య అల్లకల్లోలంగా తల్లడిల్లింది.

దాండా : ఓ - ఆవిషయమా ? అతిథికి అర్పించే మధుపర్కము మాంస మిశ్రితమై ఉండవలెనని వేదవాదమున్నది. శ్రోత్రియులైన అతిథులు వచ్చినప్పుడు ఆవుపెయ్యను గాని ఆబోతునుగాని చింబోతునుగాని మేధించి గృహస్థులు వండిపెట్టుదురు. ఈ ఆచారము ధర్మమని సూత్రకారులు స్మరించిరి.

సౌధా : ఆ - ఇప్పుడు చిక్కుపోయినాపులే ....

దాండా : అదెట్లు ? ....

సౌధా : ఎలాగంటే విను. వశిష్ఠులు వచ్చినప్పుడు ఆవుపెయ్యను ఆహుతి యిచ్చినారుగదా ! ఇప్పుడు రాజర్షి జనకుడు విచ్చేసినాడు; కాని భగవాన్ వాల్మీకి దధి మధు మిశ్రిత మాత్రంగా మధుపర్కమిచ్చి - ఆవుపెయ్యను విసర్జించినాడేమ్;

దాండా : ఇదియా ! మాంసవిసర్జనము చేయనివారిపట్లనే ఆ కల్పము ఋషులు విధించిరి. జనకుడు మాంసమును పరిహరించినాడు.

సౌధా : ఎందుకోసమో ....

దాండా : విను - ఆనాడు .... సీతాదేవికి తగిలిన దైవ దుర్విఘాతము విన్నతోడనే ఆయన వైఖానసవ్రత మవలంబించెను. అదిమొదలు

చంద్రద్వీపమందు. తపోవనములో, ఎన్నేండ్లుగానో .... తపస్సులో తపించు చున్నారు

సౌధా: అయితే ఇప్పుడు ఇక్కడికి వచ్చింది ఎందుకు?

దాండా: ఆయనకు బహుకాల ప్రియమిత్రుడు వాల్మీకులు. వారి దర్శనార్థమై ....

సౌధా: ఇప్పుడైనా ఆయన తన వియ్యపురాం[డ్రను] దర్శించెనా లేదా?

దాండా: ఆ - ఇప్పుడే పూజ్యుడైన వశిష్ఠుడు భగవతి అరుంధతి చేత కౌసల్యాదేవికి ఈ సందేశము పంపించినాడు. "నీవు స్వయముగా వెళ్ళి జనకమహారాజును సాదరముగా సందర్శింపుము" అని.

సౌధా: అలాగయితే - ఈ మహావృద్ధులందరు ఒకరి నొకరు కలిసి కొన్నట్లే. మనముకూడా వటువులతో కలిసి అనధ్యయన ఖేలనలకు పోదము రా. (ఇద్దరును పరిక్రమించి)

అయితే ఇప్పుడా రాజర్షి ఎక్కడ ఉన్నాడు?

దాండా: ఇదిగో — ఆబ్రహ్మవాది - పురాణ రాజర్షి — జనకుడు, వశిష్ఠ వాల్మీకులతో ఏకాంతము లాడుచు ఆశ్రమము బయట వృక్షమూలము నందు కూర్చొని ఉన్నాడు.

ఇట్లే కదా!

కానరాక పాతుకొని లోలోన రసలు
మైథిలీ శోకమున మగ్గి మరగు నితడు-
అంతరంతర మందున నంటుకొన్న
దహనుచే కాలు జీర్ణపాదపము పగిది.

(ఇద్దరును నిష్క్రమింతురు)

మిశ్రవిష్కంభము.

[జనకుడు ప్రవేశించును]

కఠోరంబై ఆత్మవ్రణగతిని తీక్ష్ణంబయిన ఆ
కుమారీ దుష్ప్రాప్తిన్ తగిలె - నది వేధించెడి ననున్
చిరంబయ్యున్ తత్కోపం బెడలకయె ధారాభినవమై;
తెగన్ కోయున్ మర్మచ్ఛదములను అంపంబు పగిదిన్.

ఆహా! కష్టమ్. వార్ధకవిషాదములచేత - సాంతపనపరాకాది బహు దుస్సహవ్రతములచేత - నాలోని జీవరసము ఎండిపోయినది. అయినా పనికిరాని ఈ దగ్ధదేహము ఇంకను రాలిపడకున్నది — నేడు — ఆత్మహత్యను ఒప్పుదునన్న — అట్టివారికి ఆదిత్యు డగపడని అంధతామిస్రాది నరకలోకములు విధించినారు ఋషులు.... సంవత్సరములు జరిగిపోయినవి; కాని నా క్లేశము లేశమైనను శమింపలేదు. పైగా అనుక్షణసంస్మరణ వలన అది అనుభవమంచు స్ఫుటమై — ప్రత్యగ్ర దారుణంగా ఆవేగించుచున్నది.

అయి! దేవయజన సంభూతా! సీతా! నీ జన్మభాగధేయ మిట్లు పరిణమించినదా. ఇచ్చవచ్చినట్లు ఏడ్చుటకు కూడ సిగ్గుచే శక్యము కాకున్నది నాకు. హా పుత్రీ!

తడబడు నవ్వులు - వెడవెడ నేడ్పులు —
వెడలీ వెడలని విరి పలు మొలకలు —
కలిసీ కలియని తమ్మని పలుకులు
చిలికెను తావక శిశుముఖ కమలము.

భగవతీధాత్రీ! సత్యమ్; నీవు అత్యంత దృఢశీలవు ....

సిపుణ - సహ్నా - వశిష్టపత్ని - మును ఋణ - త్రిస్రోతయున్ - రాఘవ
శ్రీవంశాద్యగురుం-డెఱుగుదురు మా సీతామహత్త్వోన్నతుల్ : —
ఆ విద్యుణ - త్రయివోలె-కాంచితిని నీ వాబిడ్డ - నెట్లోర్చినా
వో! పై దేహికి - నీదు పుత్రికి - అరణ్యోద్వాసనం బా గతిన్.

(నేపథ్యమున)

ఇటు - ఇటు - ఆర్యా ! మహాదేవీ - ఇటు.

జనక : (పరికించి) అదే కంచుకి — ఆర్యగృష్టి. భగవతి అరుంధతికి త్రోవ చూపుచున్నాడు. (లేచి) మఱి.... మహాదేవీ! అన్నాడే గృష్టి- ఎవరిపై యుండును .... (నిరూపించి) ఏమీ మహారాజు దశరథుని ధర్మదార - నా ప్రియసఖి — కౌసల్య. ఈమెను ఆ మహారాణియని ఇప్పుడు ఎవరు గుర్తింపగలరు....

దశరథునియింట శ్రీవోల్కి లసరె సీమె —
పోలిక లవేల శ్రీయనఱబోలు; నిపుడు
దైవవశమున కష్టముల్ తాక - దుఃఖ
ఘాతమయ్యె - నహో ! కర్మముల విఘాత.

ఇదియును ఒక క్లేశవికారమే.

ఇష్టమయిన యుత్సవమె రూపెత్తినట్లు
ఏ సతీ సంముఖము తనియించె నన్ను -
ఆమె సందర్శన మసహ్యా మయ్యె నేడు -
పుండయిన గాయమున ఉప్పు పోసినట్లు.

[ అంతట అరుంధతీ కౌసల్యలు-కంచుకితో ప్రవేశింతురు ]

**అరుంధతి :** దేవీ ! నేను చెప్పుచున్నాను విను. స్వయంగా వెళ్ళి రాజర్షి పాదులను చూడవలసినదని మీ కులగురువుల ఆదేశము. అందు

కోసమే గదా నేం వచ్చినది. ఇక - మాటిమాటికీ తం డ్రొత్కలాట వెందుకమ్మా!

కంచుకి: మహారాణీ! మనము దయచేసి పలుకుకొని పెద్దవుల ఆదేశము నాచరించుటకు సిద్ధమనము - అని విన్నవించుకొనుచున్నారు.

కౌసల్య: అకటా! ఇటువంటి కష్టకాలములో మిథిలాధిపుని చూడవలసె వచ్చినది. ఒక్క త్రుటిలోన దుఃఖము లన్నియును మరల మీద పడుచున్నవి. ఇట్లు మూలబంధమే సన్నసన్న హృదయమును నిలువరించుట నాచేతగాదు.

అరుం: సందేహమే లేదు. ఆ యవస్థ యట్టిదే.

ఆత్మబంధు వియోగజాయాతమైన
నరుల దుఃఖము ధార చందమున తెగక
ఉబుకు నిష్టజనంబుల నోలగించు
నప్పుడు సహస్రముఖములై - ఆపలేము.

కౌసల్య: ఇస్సీ! నా కోడలు - వత్సల - అలాంటి అనర్థకావస్థ పొందియె పోగా - ఇప్పుడీ రాజర్షి ముఖమును నే నెట్లు చూతును.

అరుం: శ్లాఘనీయుడైన సంబంధి - జనకుడు
లోద్వహుడు - పురాణయోగవేత్త -
యాజ్ఞవల్క్య ముని ముఖానుగ్రహ బ్రహ్మ
వాదవైదుషీ ప్రభాసి యితడు.

కౌసల్య: ఈయన మహారాజునకు హృదయానందదాత. వత్స - కోడలికి పితృపాదులు - రాజర్షి - కదా? కళ్యాణోత్సవము ప్రవర్తిల్లిన ఆ దినము జ్ఞప్తికి వచ్చుచున్నది. హా! దైవమా? ఇది యంతయు అంతరించిపోయినదా!

జనకుడు : (సమీపించి) భగవతీ! అరుంధతీ! వైదేహుడు-సీరధ్వజుడు అభివాద మర్పించుచున్నాడు.

పురాణాచార్యారాధనపరుడు - పావిత్ర్యనిధి - నీ
విభుం డెంచుగా నీ సన్నిధిని ప్రాతుండ ననుచున్;
త్రిలోకైకకళ్యాణీ! అవనితలిపై మోపి శిరసున్ -
జగన్వంద్యోషస్సుగా-దలె నిను భజింతుగా భగవతీ!

అరుంధతి: అక్షరమునకందని జ్యోతి నీకు ప్రకాశమానమగుగాక - రజః పారమున విరాజిల్లు పరమాత్మ నిన్ను పునీతుని చేయుగాక.

జనకు : ఆర్యగ్రష్టి-ప్రజాపాలకుని తల్లికి - ఈమెకు కుశలమే గదా.

కంచుకి : (స్వగతమ్) అబ్బా - నిష్ఠురంగా - నిశ్శేషంగా - వెడలిన ఈ పలుకులు మర్మములు తాకి నన్ను అవమానించుచున్నవి. (ప్రకాశముగా) రాజర్షీ! ఇటువంటి కోపముతోనే ఈమె ఎప్పుడో ఎంత కాలము క్రిందటనో రామభద్రుని ముఖము చూచుట మానివేసినది. అతి దుఃఖములోనున్న దేవిని మరింత దుఃఖపెట్టుట మీకు అర్హము కాదు. నాడు రామభద్రుడుకూడా ఏవో దుర్యోగమునకు పాల్పైనాడు. అది దైవికము. ఏమన—ఇటు పౌరులన్నతో అంతటను బీభత్సముగా అపవాదులు విస్తరింపసాగిరి. అటు అగ్నిశుద్ధిపట్ల అల్పజనులకు నమ్మకము లేకపోయినది. అట్టి క్లిష్టతరవస్థలో ఈ దారుణము జరిగినది.

జనక : (రోషముతో) ఎవ డీఅగ్ని? మా సంతానమును పరిశోధించుటకు.... జనులలో—ఇలాటి అశిష్టవాదు లున్నారు కష్టమ్. మొదట రామభద్రుడు చేసిన పరిభవము - ఇపుడు తిరిగి ఈ అవమానము.

అరుంధతి : (నిట్టూర్పు విడుచుచు) ఇది నిజము. అగ్ని — అగ్ని అని పలుమారు ఈ విషయమున తడవుట ఆమెను చిన్నబుచ్చుటే. సీతా పదమే సమస్తవిశుద్ధికినీ ప్రమాణసీమ. హా! వత్సా!

చిఱుతవొ శిష్యురాలవొ వచింపగ నేటికి? నాకు నీయెడన్
పెరిగెను భక్తి పావకవవిప్రసువృత్తి విశుద్ధసిద్ధి — సం
బరమున నీకు మ్రొక్కును ప్రపంచము—స్త్రీత్వ శిశుత్వమేది? శ్రీ
పురుషవయస్సు లేమిటికి? -పూజ్యత-కొక్క గుణంబె స్థానమౌ.

కౌసల్య : అబ్బా! ఆత్మలోని వేదనలు ఆగక పైకుబికి వెల్లువ లగుచున్నవి. (మూర్ఛపోవును)

జనక : హా! కష్టము! ఏమి — ఈ గతి....

అరుం : మతేమున్నది ....

ఆ రాజోత్తము - డా సుఖంబు - తదపత్యవ్రాత - మా వాసరా
చారంబుల్ స్మృతికెక్క నన్నియు - నభీష్టస్నేహితుఁ నిఁ గనన్;
ఘోరంబై తదరిష్ట కష్టనిహతిఁ గూలెఁ భవన్మిత్ర మి
ట్లో రాజర్షి! నవీనమూన మృదువుల్ యోషిజ్జనస్వాంతముల్.

జనక : ఇస్సీ! అన్నిటను నేను ఘాతుకుడనుగా మారితిని. చిరకాలమునకు చూడవచ్చిన మిత్రమును-మిత్రుని కళత్రమును-ప్రసన్నంగా పలుకరింపలేకపోతిని గదా.

అతం-డత్యంత శ్లాఘ్యుడు - సఖుడు - సంబంధియును - అ
స్మదానందం - బాప్తుండు - తనువును - జీవాత్మయును — జీ
విత ప్రాప్యంబుఁ - సర్వము నతడు నా జన్మకిల — ఆ
మహారాజశ్రీ - శ్రీ దశరథుడు - కా డెయ్యది యికన్.

కష్టమ్ - కౌసల్యయును అట్టి దురవస్థలోనే ఉన్నది. అక్కటా!

అలుకలవేళ నర్మవిషయంబుల దంపతు లొక్కరొక్క రె
గ్గెలు వచియింప నే నొకడ కూర్తును వారికి - చక్కపెట్టు తీ
ర్పులు తరువాత నా వశమె - రోషము తోషము - యేని! ఆ తలం
పులు తలపోయ నాహృదయమున్ దహియించును దారుణంబులై.

అరుంధతి: అయ్యో! అతికాలము ఆగిపోయిన ఈమె గుండె గడ్డ కట్టుచున్నది.

జనక: హా; ప్రియసఖీ! (అని కమండలూదకమును కౌసల్య మీద చల్లును)

కంచు: కొలుత నేకముగా ననుకూలమై
చెలివిధాన సుఖంబునె కూరుచున్
తుది - నకారణ దారుణఘోరమై
విధి - రగుల్చు మనోవ్యథలన్ కటా!

కౌసల్య: హా! వత్సా! జానకీ! ఎక్కడ ఉన్నావో నిన్ను తలచుకొనుచున్నాను. ఆనాడు పెండ్లికళ ఒక్కటే ఆభరణంగా నిన్ను అందగించెను. అప్పుడు ముదితమైన నీ నవ్వు మొగము శుద్ధకల్హార విందము వలె శోభించినది. చంద్ర చంద్రికా సుందరములైన నీ మంగళాంగములు నా యొడి నిండగా ఇంకొకసారి కూర్చుందువా? అప్పటి సౌభాగ్యమును గూర్చి మహారాజు పలుమాఱు తలచుకొనువాడు. " ఈమె రఘుకుల రాజశేఖరులకు కోడ లగును గాక, ఐనను జనకబాంధవము వలన మనకు కూతురే యగును - అని.

గళము: గొంతుకు తేపరైన టూర్చు రాజునకు, సు
బాహు లోగొనిన ప్రభాపశాలి—
కలదు ప్రీతి యల్లై నలుపురు కోడండ్లు —
కూతు శాంత పగిది — సీతమీద.

జనక : హా ! ప్రియసఖా ! మహారాజ దశరథా ! అన్నివిధములను నీవు మనఃప్రియుడవు. ఎట్లు మఱువవచ్చును....

అల్లుఁబట్టి భజింత్రు వియ్యముల కన్యాబాంధవుల్ - తద్విధం
బెల్లఁ వ్యత్యయమయ్యె నియ్యెడల నఁ నీ వర్చితుఁ జేయగా:
చెల్లెఁ తావకకాల-మట్టులె నడించెఁ యుష్మదస్మద్యశో
వాల్లభ్యాంకుర-మింక నీ నరక జీవక్లేశమే నాకగున్.

కౌసల్య : పట్టీ ! సీతా ! ఏమి చేయుదును. గట్టి వజ్రలేప మేదో నన్నిక్కడ కదలకుండా బిగించినది. ఈ దగ్ధజీవితము నన్ను వదలిపెట్టదు .... ఎంతటి భాగ్యహీననో....

అరుం : రాజపుత్రీ ! ఊరటతెచ్చుకో. కన్నీళ్ళకుకూడా కొంత విశ్రాంతి కావలెను గదా ! కానిమ్ము. జ్ఞాపకమున్నదా ! మీ కులగురువులు ఋష్యశృంగాశ్రమములో పలికిన పలుకు. "కావలసిన కారణార్థము జరిగిపోయినది. కట్టకడకు కల్యాణమే అగును" అని గదా....

కౌసల్య : తల్లీ ! అది యెట్లు కాగలదు. ఆ మనోరథములన్నీ మునిగి పోయినవి. చాల కాలము గడిచినది.

అరుం : రాజపుత్రీ ! గురువచన మబద్ధమగు ననుకొంటివా ! నహి, క్షత్రియాన్వయీ ! అన్యథా భావింపవద్దు. అది భవితవ్యమ్.

లక్ష్మీధామంబున్ పదస్థాపకంబున్
జ్యోతిస్సంక్రాంతంబు నా బ్రహ్మబోధ్రిల్
సందేహింపన్ రాదు రాజన్యపుత్రీ!
రిక్తార్థంబుల్ కావుగా వారి పల్కుల్.

(నేపథ్యమున కలకలము — అందరును ఆలకింతురు)

జనక: శిష్టుల రాకచే నేడు అనధ్యయనము. ఉత్సర్జన మందిన బ్రహ్మచారుల ఆటలసందడి యిది.

కౌసల్య: చిన్నతనములో సుఖములు సులభములు గదా.

(ఒకదిక్కు నిరూపించి)

వీరి నడుమ - ఇతడొకడు - మా రామభద్రుని వాలకముతో శోభిల్లుచున్నాడు. మృదుముగ్ధము లైనను గర్వపర్వములై కుమారుని అంగములు నా కన్నులను చల్లగా తనుపుచున్నవి.

అరుంధతి: (అపవారితముగా - హర్షబాష్పములతో) కర్ణకామితంగా భాగీరథి నాకు వినిపించిన రహస్య మిదే కావలయును — అయితే — కవలబిడ్డలయిన ఆ కుశలవులలో ఈ చిన్నవా డెవడో స్పష్టమగుట లేదు.

జనక: నవనీలోత్పలకాంతు లీనుచు, శిఖండస్నిగ్ధశృంగారమున్
మివులన్; త్రిమ్మరు బ్రహ్మచారిసభ స్వామిన్‌బోలె - రాజిల్లు వీ
డెవడో? నేత్రసుధాంజనం బటుల స్నేహించున్ తనూశ్రీరుచిన్
అవునో మా రఘునందనుం డిటు కుమారాచ్ఛాదనన్ రాడుగా.

కంచుకి: ఇతడు క్షత్రియబ్రహ్మచారి యని తలచుచున్నాను.

జనక : అది నిజమే ! ఏమన ....

తఃకలు సిగముడిజా దాక జంటగ పొదుల్
వీపున కిరుపంక మోపినాడు,
భస్మలాంఛనములు భాసిల్లు వక్షాన
అజినోత్తరీయంబు హత్తినాడు,
మొలత్రాడుగా నారి మెలయించి యెఱ్ఱని
చెడ్డీని కటిసీమ చెక్కినాడు,
అశ్వత్థదండంబు నక్షమాలయు వ్రేల
బాణాసనము చేత పట్టినాడు.

భగవతీ ! అరుంధతీ ! ఇతడు ఎవరివాడనుకొందువు ?

అరుం : మేముకూడా ఈ దినమే ఆశ్రమము చేరితిమి.

జనక : ఆర్యగృష్టీ ! నాకు మిక్కిలి వేడుక యగుచున్నది. నీవువెళ్ళి స్వయంగా భగవాన్ వాల్మీకినే అడుగుము....ఇంకా....ఆపిల్లవానితో ఇట్లు చెప్పుము. " మీరు .... ఎవరో వయోవృద్ధులు నిన్ను చూడ వేడుకపడుచున్నా" రని.

కంచుకి : దేవర ఆజ్ఞాపించినట్లే. (నిష్క్రమించును)

కౌసల్య : మీరేమనుకొనుచున్నారు. ఇట్లు చెప్పినంతనే అతడు వచ్చునా ?

అరుం : బ్రహ్మనిర్మాణములో ఇటువంటి రూపసౌష్టవమునకు బుజు వినీతి వేఱుపడియుండదు.

కౌసల్య : (పరికించి చూచి) ఏమిదీ ! గృష్టిమాటలు సవినయంగా విని ఆ బాలుడు తోడి పిల్లలను వదలి ఇటుమొగమై కదలినాడు.

జనక : (పరకాయించి) ఓహో ! ఆశ్చర్యమ్ !

పసితనపుఁ నిగారమును - భద్రవినీతముతై న ధీర రా
జసముల నెన్న కోవిదులె చాలరికనన్యుల నేమి చెప్పగా,
వసమతియున్న నా జడమనంబును గూడ బలాత్కరించు లా
లసముగ - సూదితాతుసుక లాగు అయస్కకలంబు బోలికన్.

లవుడు : (ప్రవేశించి) వీరందఱు పూజ్యులే. అయినను - పేరు పెద్దరికములు తెలియక ఈ యభిజనమునకు ప్రణమించు క్రమమెట్లో ....
(ఆలోచించి) ఈ పద్ధతి అవిరుద్ధమని పూర్వులవలన వింటిని.
(సవినయంగా సమీపించి) ఇవే లవుని ప్రణామపర్యాయములు.

అరుంధతి } జనకుడు } కళ్యాణమతీ ! అనంతాయుష్మంతుడ వగుము.

కౌసల్య : చిరంజీవి వగుము.

అరుంధతి : ఓయీ ! ఇలా రా ! ( అని ఒడిలో కూర్చుండబెట్టుకొని — అపవారించి ) ఆ - నా ఒడి నిండింది. దీనితో — చిరకాలమునుండి మెదలుచున్న నా మనోరథముకూడ పండింది.

కౌసల్య : బిడ్డా ! కొంచెము ఈ ప్రక్కకు కూడా రా ( అని ఒడిలో ఎత్తుకొని ) అహో ! ఇతడు రామభద్రుని పుణికిపుచ్చుకొన్నాడు. ఇంచుక విచ్చిన నల్లకలువల నవకముతో నిగ్గులు తేఱు దేహబంధము చేతనేకాదు — కంఠస్వరము సైతము — కమలకేసరములు కొఱికిన కషాయకంఠముతో కూయు కలహంస నినాదమువలె-దీర్ఘస్వరితంగా రామభద్రు ననుకరించుచున్నది. ఇంకా - శరీరరుచి మాత్రమే కాదు. దాని స్పర్శనము కూడా - కలుకులేని తామరపువ్వు లోపలి కోమలదళములవలె - మెత్తగా, అతని తాకినట్లే ఉన్నది. బిడ్డా ! కొంచెము నీ

ముఖము చూడనీ ! ( గడ్డము పెత్తిపట్టి - సబాష్పముగా ) రాజర్షీ ! నీకు కనబడుటలేదా ? పరికింపగా ఈ శిశుముఖము - వత్సల — నా కోడలి వదన చంద్రబింబము వలెనే ఉన్నది.

జనక : చూచుచున్నాను. మైత్రేయీ చూచుచున్నాను.

కౌసల్య : ఓహో ! ఏమిది. పిచ్చిపట్టినట్లు నా హృదయ మీతనిస్పర్శతో ఏమేమో తలవని తలంపులతో తలమున్కలవుచున్నది.

జన : కూతురి భాగ్యరేఖలు రఘూద్వహు పోలిక లచ్చుపోసి న ట్లీతనియందు కానబడియెడి ప్రతిబింబములై - సురూప వా చాతను కాంతులుడా - సుకృతిసంస్కృతులుడా - తలపోయ నయ్యావే పాతఅలాడుచుడా మనసు పైపయి పర్విడు నేటికో విధీ —

కౌస : బాలకా ? నీకు తల్లి ఉన్నదా ? తండ్రిని ఎఱుగుదువా ?

లవ : నహి .... ....

కౌస : బాబూ ! అలాగయితే నీకు ఎవరున్నారు ?

లవ : భగవాన్ వాల్మీకి....

కౌస : చిన్నవాడా ! చెప్పవలసినదంతా చెప్పుము.

లవ : నేను ఇంతే ఎఱుగుదును.

(నేపథ్యమున)

ఓ సైనికులారా ! కుమార చంద్రకేతువు ఇట్లు ఆజ్ఞాపించుచున్నాడు- ఇవి ఆశ్రమారణ్యభూములు. ఎవ్వరును ఆక్రమింపరాదు.

అరుంధతీ } జనకులు } యాగాశ్వ రక్షణము నిమిత్తంగా కుమార చంద్రకేతువు వచ్చుచున్నాడు. అతని నిపుడు చూతుము. ఇది సుదినము.

కౌసల్య: అహో! "కుమార లక్ష్మణునిపుత్రుడు - ఆజ్ఞాపించుచున్నాడు". ఈ పలుకులు అమృతబిందువుల చిందునట్లు సోకుచున్నవి.

లవ: ఆర్యా! ఈ చంద్రకేతు వెవరు?

జన: ఎఱుగుదువు గదా! దశరథపుత్రులను రామలక్ష్మణులను.

లవ: ఎందుకెఱుగను - వారు రామాయణకథాపురుషులు.

జన: అటులైన ఇతనినేల యెఱుగవు? - అందు లక్ష్మణుని పుత్రుడు - ఇతడు చంద్రకేతువు.

లవ: అలాగా - అంటే ఊర్మిళాకుమారుడు - మిథిలాధిపతియైన రాజర్షికి మనుమడు....

అరుం: (నవ్వుచు) బాగు - బాలుని కథాప్రావీణ్యము తేటపడుచున్నది.

జన: (ఆలోచనతో) వత్సా! నీకు కథాభాగము బాగా జ్ఞాపకమున్నట్లున్నది. మేము అడిగినది చెప్పెదవా? ఆ దశరథపుత్రులలో ఏపేర్లు గలవారికి - ఏయే దారల వలన - ఎవ్వరెవ్వరు పుట్టిరి?

లవ: కథలోని ఈ యంతర్భాగమును మేమిదివఱకు వినలేదు. ఇతరులు కూడా ఎఱుగరు.

జన: ఏమీ దానిని కవి రచింపలేదా?

లవ: రచన జరిగినది. కాని ప్రకాశనము కాలేదు. అందులోని ఒకానొక భాగమును అభినయార్థమై వేఱొక ప్రబంధముగా రచించెను. దానిని మహర్షి స్వయముగా లిఖించి నృత్త గీత వాద్య సూత్రధారియగు భగవాన్ భరతునకు పంపించెను.

జన: ఎందుకొఱకు?

లవ: వారు దానిని అప్సరసలచే ఆడించుటకై....

జన : ఇది యంతయు మాకు అబోధ కౌతుకమును కలిగించుచున్నది.

లవ : భగవంతునకు దానియెడలగల ఆస్థ మహత్తరమైనది. ఆపుస్తకమును ఏ శిష్యులచేత భరతాశ్రమమునకు పంపినారో వారికి తోడుగా ప్రమాదనివారణకై చాపధారి యగు నా సహోదరుని కూడా పంపిరి.

కౌసల్య : నీకు భ్రాతకూడ కలడా ?

లవ : కలడు. ఆర్యుడు కుశుడు.

కౌసల్య : నీకు అన్న కలడని చెప్పినట్లయినది.

లవ : అవును. జననక్రమమునుబట్టి అతడు నాకు జ్యేష్ఠుడు.

జన : చిరంజీవులు కవలబిడ్డలా ?

లవ : మఱి యేమనుకొనుము.

జన : వత్సా ! చెప్పుము--ప్రకాశితమైన కథాప్రబంధము ఎంతవఱకు వచ్చినది.

లవ : అబద్ధజనాపవాదమునకు పరితపించి దేవయజనసంభూతను సీతను రాముడు విసర్జించెను. కానుపు నొప్పులు పడుచున్న ఆమెను — ఏకాకినిగా — అరణ్యమున విడిచి లక్ష్మణుడు తిరిగిపోయెను. ఇంత వఱకు....

కౌసల్య : హా ! వత్సా ! చంద్రసుందరముఖీ ! ఒంటరిదాన వైనప్పుడు దైవదుర్విలాసముచే పువ్వువంటి నీ శరీరమునకు ఏమిగతి పట్టినదో గదా !

జన : పరిభవమంది. కారడవిపాలయి, అందు కఠోర వేదనల్
తెరల ప్రసూతికాలమున - దిక్కఱి - క్రూరమృగంబు లంతటన్
పరికొన గుంపులై, వెఱచి, పాలనయాలనలేమి ఎన్నిసా
ర్లఱచి స్మరించినావొ జనకా యని నన్ను కుమారికామణీ !

లవ : (అరుంధతివైపు తిరిగి) అమ్మా, వీరెవరు ?

అరుం : ఈమె కౌసల్య - ఆయన జనకుడు.

లవ : (గౌరవఖేద కౌతుకములతో వారిని చూచుచున్నాడు).

జన : ఆహా ! పౌరుల దుర్మర్యాద - రాజైన రాముని ఆతురత.

ఈ పరుషాశని ప్రహతి నేల తపింపగ రేల్చుపష్ణ - నా

చాపమొ శాపమొ రగుల శాంతిలు కోపము....

కౌసల్య: (భయకంపములతో అరుంధతిని చూచి) భగవతీ ! రోషముతో నున్న రాజర్షిని శాంతపఱుచుము.

లవ : ఇది తగు ప్రాయశ్చిత్తము

ముదిత మనస్విజనము పరిభూత మగువెడన్:

అరుం : కద నీకు సుతుడు రాముడు —

సురయాపాత్రలు - కృపణులు - సుమి ప్రజలు ఋషీ !

జనక : .... .... .... .... .... .... .... .... కాని రెండునుఁ

పాపమె - యెట్లు ? పుత్రకులభాండము రాముడు నాకు - లోకమో

పాపలు, స్త్రీలు - వృద్ధులు - విపన్న జనద్విజపాళి నిందెడిఁ.

[సంభ్రాంతులై వటులు ప్రవేశింతురు]

వటులు : కుమారా ! కుమారా ! గుఱ్ఱం — గుఱ్ఱం — అనే జంతువిశేషము జనపదములలో ఉండునని వినుచుంటిమే - అది ఇప్పుడు - సాక్షాత్తుగా మాకంట పడింది.

లవ : గుఱ్ఱమనేది యాగపశువర్గములోను - సంగ్రామసంనాహములలోను చదివితిమి. అయితే దాని రూపము ఎట్లున్నదీ —

పటులు : ఓహో — వినుఁ.

నిడు వాలుం గుఱు లూఁగ తోఁక వెనుకన్ వ్రేలంగ నాడించెడున్
మెడ దీర్ఘంబగు - నాల్గుగిట్టలమరున్ - మేయున్ తృణగ్రాసమున్
విడుచున్ మామిడికాయలంతలు శకృత్పిండంబు - లల్లల్ల ప
ర్విడు - నీ వాదులకేమి ! దూరమగు - రం డీక్షింత మా జంతువున్

(అని అతని అజినోత్తరీయమును చేతులను పట్టి లాగుదురు)

లవ : (కౌతుకమును వినయముతో అణచుకొని) చూడండీ — పెద్దలు ! నన్ను వీరు ఎలా లాగుతున్నారో — (అని త్వరగా పరిక్రమించును)

అరుంధతీ<br>జనకులు } వత్సా ! నీ వేడుక తీర్చుకో !

కౌసల్య : భగవతీ ! ఈ బాలుని చూడక నా ప్రాణములు నిలుచునట్లు తోఁచదు. మనము వటువులు లాగికొని పోవుచున్న గర్వపోతమును చిరంజీవిని ఆ యెత్తయిన చోటునుండి చూతము.

అరుం : పరువులెత్తుచు - అతి దూరము దాటిపోయినాడు - ఆ చపలుడు - మనకింక ఎక్కడ కనబడును.

కంచుకి : (ప్రవేశించి) భగవాన్ వాల్మీకులు ఇట్లనిరి.

"దీనిని అవసరమైనపుడు మీ రెఱుగగలరు."

జనక : ఇది ఏమో - అగోచరంగా ఉన్నది. భగవతీ! అరుంధతీ! సఖీ! కౌసల్యా ! ఆర్యగృష్టి ! మనమే స్వయంగా వెళ్ళి భగవాన్ ప్రాచేతసుని చూతము. (నిష్క్రమింతురు)

[ వటువులు ప్రవేశింతురు ]

వటు : కుమారా ! చూడు. ఇది ఆశ్చర్యము.

లవ : చూచితిని. తెలిసినది. ఇది అశ్వమేధము నందు విడిచిన యజ్ఞాశ్వము.

వటు : అది యెట్లు తెలియనగును ?

లవ : మూర్ఖులురా మీరు ! ఆ రామాయణకాండ మీరుకూడ చదివినదే. చూడండి. వందమంది దండధరులు — ఇక అంతమంది తూణీర బద్ధులు - రక్షకబలముగా వెంట కనబడుచున్నది. దీని నమ్మరేని — వెళ్ళివారినే అడుగుడు.

వటు : ఓహో సైనికులారా ! ఎందుకోసము ఈ గుఱ్ఱము పరివారసమేతంగా తిరుగుచున్నది ?

లవ : ( సస్పృహుండై తనలో ) అశ్వమేధము.... ఈ పేరుతో విశ్వ విజయము కావించిన క్షత్త్రియులు స్వోత్కర్షను ప్రకర్షింతురు. ఇది సకల క్షత్త్రలోకమునకును అవమాన శాసనము — శౌర్యధారకు ఇది పెద్ద ఱాతి సాన.

(నేపథ్యమున)

ఇది మహాశ్వమతల్లిక - అదె పతాక —
ఇదియగు సమస్తసప్తలోకైకవీరు
వీరఘోషణ - దశకంఠవైరియాజ్ఞ —
ఎఱుగుడీ దిగ్విజయ యాత్ర నెల్లరిట్లు.

లవ : (బాధతో) ఈ అక్షరాలు మంటలెత్తించునట్లున్నవి.

వటు : ఏమనవచ్చును. ప్రాజ్ఞుడు కదా రాజకుమారుడు !

లవ : ఓహో ! ఎంతకీ అంతేలు ! పృథివీమండలమే అక్షత్రియమై వీరశూన్యమైపోయినదా !

(నేపథ్యమున)

అరే ! మహారాజును ఎదురు క్షత్రియు వెవడురా ?

లవ : ఛీ ! మూఢులారా !

అట్టివారున్న ఉంతని మ్మంతె యెంబో
ఎందుకో ఈ ఎదురుపడ్డ ఇంక నొకటి;
ఏటికీ వట్టి బింకాలమాట ! ఇదిగో
అపహరించితి నీ పై జయంతి నేను.

వటువులారా ! ఈ గుఱ్ఱమును చుట్టుముట్టి రాళ్లు రువ్వండి - మరలించి మన ఆడుదేళ్ళమందలో తోలండి. అక్కడ మేదిరించుచూ ఉండనీ.

[క్రోధముతో ఒక పురుషుడు ప్రవేశించును]

పురుషుడు : ఛీ ! చపలుడా ! ఏమంటివీ ! పసివాడవని దారుణ దండధారులైన ఆయుధీయులు నీ కసరు మాటలను సహింపరు. మా రాజపుత్రుడు - చంద్రకేతువు — ఉదాత్తకులీనుడు. అపూర్వములైన ఈ సౌమ్యారణ్యములు అకట్టగా కుతూహలహృదయముతో ఆలసించినాడు. అతడు రాకముందే - తొందర తొందరగా - ఈ చెట్లగుంపుల వెంబడి పారిపొమ్ము.... ....

వటుడు : కుమారా ! ఈ గుఱ్ఱముసంగతి కట్టిపెట్టు. చాలు - విండ్లెక్కుపెట్టి బాణ్లుతీర్చి ఈ ఆయుధధారులు పసివానిని భయపెట్టుచున్నారు. మన ఆశ్రమపదము ఇక్కడికి చాల దూరమందున్నది. అందువలన రా - లేడిదాట్లతో పరుగెత్తిపోదము.

లవ : బలే ! ఎందుకోసమో ? వీరు ధనుస్సు లెక్కపెట్టి – శరాలు ఝళిపించుచున్నారు.

ధనురగ్రంబుల ద్రష్ట్రలన్ బిగియ విల్ త్రాడుగ్రజిహ్వాగ్రమై
క్వణదంభోధర ఘోషభీషణరటత్ గర్జాసముద్గారమై
హననోద్యుక్తరుషాదురంతక విహాస్యద్వక్త్ర యంత్రోదరం
బన నీ కార్ముక జృంభితావరణ మధ్యంబుల్ విడంబించుతన్.

( యథోచితముగా పరిక్రమించుచు అందఱును నిష్క్రమింతురు )

కౌసల్యా జనకయోగ మను చతుర్థాంకము



# పంచమాంకము

ఓహో! సైనికులారా! ఇదిగో, మన జీత — ఇదే మన ఉద్ధారము.

కోవిదారధ్వజప్రభల్ కావరింప
అరిదివడి మాకు సత్త్వాల అరటమెక్క
తోలగ సుమంత్రు డాహవ మాలకించి
చంద్రకేతు విదే వచ్చె చలము చలిచి.

[సారథితో రథారూఢుడై - విల్లు చేతబూని హర్షసంభ్రమములతో చంద్రకేతువు ప్రవేశించును]

చంద్ర: ఆర్య. సుమంత్రా! అటు చూడు.

ముఖముచి యొఱపెక్కంగా నుంత కోపంబు చూపి
శిఖ లయిమగు చిందావంగ ప్రయోగించు వింటిన్,
రణముఖమున సారించుణా శుషాస్త్రధారల్
మన బలములపై నీ వీరపోతం బెవండో.

ఆశ్చర్యమ్!

మునిబాలుం డొకరుం డనేకబలముల్ మూగంగ పోరాడు: రః
తని నజ్ఞాత రఘుక్రమాంకురము కాదా యంచు కామించెదన్,
అనిలోద్గార శరప్రసారణ ధనుర్జ్యాబంధ టంకార నీ
డనతో బద్ధజవాలు మత్తగజ గండగ్రంథి సంధిష్ఠలున్.

సుమం: ఆయుష్మంతుడా!

చేప దాసపు విక్రమాధిక మనస్వి.
శిశువు నితని నీ పోలికన్ బిలుకు వాని
సరయ - తలపించు కౌశిక యజ్ఞమందు
ధనువు నెత్తు రఘుకుల నందనుడు నాకు.

చంద్ర : ఈత డొక్కనితో అసంఖ్యాకులము పోరు ప్రారంభించుటకు మనసు సిగ్గుపడుచున్నది.

శిశు వీతం డొకరుండు - చుట్టి బల మాజిన్ మొత్తమై - శస్త్రచు
ర్ణిశితజ్వాల ఛటాప్రవాళజటిలార్చిః క్రూరమై, కింకిణీ
భృశనిక్వాణ ఝణంఝణాయుత రథక్రీడాటనంబై, నిరం
కుశ మాతంగ మదాంబుదాంధతమమై ఘోరాహవాందోళనన్.

సుమం : వత్సా ! ఇంతమంది కలిసి ఏకమై ఎత్తినా అతని నేమి చేయగలరు ? ఇక విడివిడిగానయితే చెప్పవలసినదేమి ?

చంద్ర : ఆర్య ! త్వరపడుము — త్వరపడుము. ఈతడు మా బలమును ప్రచండముగా పరిమార్పసాగినాడు ....

రావత్తై పో మన మండుఘన్ - తన ధనుర్ఘోష ప్రకర్షార్భటిన్
పొదలన్ కొండల నున్న యేన్గుల చెవుల్ పోబెత్తి గ్రే పెట్టగా,
కదనంబెల్ల నృముండఖండములతో గప్పెన్ కృతాంతక్రుధా
పరసోద్గారకరాల మాంసకబలవ్యాఘాత భీతంబుగన్.

సుమం : (తనలో) ఇట్టి బాలునితో కుమార చంద్రకేతువు ద్వంద్వ యుద్ధము చేయుటకు ఎట్లంగీకరింతును ? (ఆలోచించి), మేము ఇక్ష్వాకులయిండ్లలో గదా పెరిగి వృద్ధులమైతిమి. అదికాక యుద్ధము సన్నద్ధమైనప్పుడు వేఱుగతి యేమి ?

చంద్ర : ( విస్మయలజ్జాసంభ్రమములతో ) ఛీ! నా సైన్యము సమస్తము వెనుక తిరిగినది.

సుమం : (రథమును త్వరగా తోలుచు) ఇదిగో! ఆ వీరుడు కూతవేటు దూరమునకు వచ్చినాడు.

చంద్ర : (మఱపు నభినయించి) ఇతని పేరు వారేదో చెప్పినారే.

సుమం : లవుడని....

చంద్ర : ఓహో! లవ! మహాబాహూ!

పోరేల నీకు సేనతో
నే నుంటిని రమ్మిటులన్
తేజంబున్ తేజం బణచున్.

సుమం : కుమార! చూడు – చూడు.

నీదు పిలుపున మఱచె అనీకినీని
ఘాతమును మాని ఈ వీరపోత మదియె
వారిదరవంబు విని గజమారణంబు
వదలెడి సగర్వ సింహశాబకము చాయ.

[అంత, త్వరతో ఉద్ధతుడైన లవుడు ప్రవేశించును]

లవ : మేలు రాజపుత్రా! మేలు. సత్యముగా నీవు ఇక్ష్వాకుకులీనుడవే! ఇదిగో నేనును వచ్చినాను.

(నేపథ్యమున పెద్ద కోలాహలము)

లవ : ( వేగముగా తిరిగి చూచి ) ఆ – వెన్నిచ్చి పలాయితులై – మఱల భంగపడి ఈ సేనాపతులు యుద్ధాభిముఖులై నన్ను వెంబడించ సాహసించుచున్నారు .... ఛీ! క్షుద్రులారా :

"భయదాహార్య విముఖ్యమాన బడబాపహ్నిచ్ఛటాధీలన
క్రియ లీంద్రించెడి మామకీన సమరక్రీడాక్రుధాధారకుఁ
లయకాలానిలఘాతవార్ధిజలవేలఁ బోజు నీ క్షుద్రసం
చయ కోలాహల సైన్యసంరభస మీషద్గ్రాసమై పోయెడిఁ.

ఇటు నటు తిరుగుచున్నాడు.

చంద్ర : ఓయీ ! సమారవీర !

ప్రియము పెనంచె నీ సుగుణవృత్తి నిజాతిశయుంబు: దాన నా
కయితివిగా సఖుండవు - యథార్థ మిదిట్లగుటఁ సుహృన్మణీ !
పయిగాని యేటి కాత్మపరివారబలంబుల విగ్రహింప ? నీ
జయవదుదాత్త దర్పనికషంబును నే నిదె చంద్రకేతువుఁ.

లవ : ( హర్ష సంభ్రమములతో పలికి ) ఆహా ! ఈ మహానుభావుని పలుకులు ఎంత ప్రసన్నములో అంత కర్కశము లై, వీర వచన ప్రయుక్తములుగా ఉన్నవి. సూర్యవంశ ప్రసూతుడితడు. ఈ దండుతో నేమి ! ఇతనినే గౌరవింతును.

(తిరిగి నేపథ్యమున కలకలము)

లవ : ( క్రోధనిర్వేదములతో ) ఇస్సీ ! ఈ పాపిష్ఠులు వీరసంవాదమునకు విఘ్నము కల్పించి - నన్ను పెడత్రోవకు లాగుచున్నారు.

( అని వారివైపు తిరుగును )

చంద్ర : ఆర్య సుమంత్ర ! చూడ తగినది. అదె చూడు.

కుతుకము దర్పమునఁ పెనచికో తన లక్ష్యము నిల్పి నాపయిఁ
ప్రతతబలంబు వెన్క పొదువఁ ధనువెత్తిన యీ కుమారుడు

ద్ధతపవనంబు రాక ఇరుదండను వంగెడి ఇంద్రచాపరం
జిత రమణీయతోయదరుచిఁ దలపించు మనోహరంబుగన్.

సుమం: కుమార! నీవే యీతని చూడనేర్తువు. నేను విస్మయముతో అస్వాధీనుడనైతిని.

చంద్ర: ఓహో! రాజయోధులారా!

అరదము లెక్కి సామజహయంబుల మీద ననేకు లేత్తెరన్
పిరికొన పాదచారి నొకనిన్; కవియన్ కవచాస్త్రులైన పో
టరు లజినోత్తరీయు నొకటన్; వయసారిన జ్యేష్ఠులొక్కపై
పరిగొన పాలు గారు పసివానిని; మీకును మాకు సిగ్గగున్.

లవ: (వినువుతో) ఏమిది! ఇతడు నన్ను కనికరించుచున్నట్లున్నది. (ఆలోచించి) కాలయాపన కాకుండ జృంభకాస్త్రముతో ఈ సైన్యమును స్తంభింపచేయుదును. (ధ్యానము నటించును)

చంద్ర: ఇదేమి? హఠాత్తుగా మనసైన్యసంమర్ద మాగిపోయినది.

లవ: ఇక నీతనిప్రగల్భము పరికించెదను.

సుమం: వత్సా! ఈకుమారుడు జృంభకాస్త్రమును అభిమంత్రించి విడిచె నని తోచుచున్నది. (ఊహింతును)

చంద్ర: అందుకేమి సందేహము. చూడు —

మెఱుపు లెగయు పెంజీకట్లు క్రమ్మఁగ జగంబుఁగ
కనుగవ మిఱుమిట్లఁగా వ్రాలు విచ్చఁగ బెడందన్
ప్రతిమలగతి నిశ్చేష్టించి నిల్చెఁ బలంబుల్
విజ మివియ మహావీర్యాస్త్రముల్ జృంభకంబుల్.

ఆశ్చర్య-మాశ్చర్యమ్....

సుమంత్రి :

బలిసద్మాంతర గర్భకోశముల తెప్పల్ గట్టు చీకట్లనన్
కొలిమిఁ గాగిన క్రొత్తయి త్తడి మెఱుంగుల్ క్రిక్కచుఁ, జృంభక
జ్వాలరేఖల్ మినుముట్టె-దుర్విలయఝుంఝూవాతధూతాంబుదా
నిల విద్యుత్ కపిలచ్ఛవీకృతదరీ వింధ్యాశిఖాగ్రింబులై.

ఇతని కీ జృంభకాస్త్రములు ఎట్లు లభించియుండును.

చంద్రి : మహర్షి వాల్మీకిప్రిసాద మనుకొందును.

సుమం : వత్సా ; ఆయనకు దీనితో ప్రిమేయము లేదు. విశేషించి జృంభకాస్త్రవిషయము ఈయన యెఱుగడు. ఏమన :

మున్ను కృశాశ్వతపోనిధి
కన్న వి యీ జృంభకములు- కౌశికువశమై
యున్న తదస్త్రముల-నతం
డెన్నఁడో రామున కనుగ్రహించెను బ్రీతిన్.

చంద్ర : అన్యథా సైతము పరమపరిపాకము పొందిన సత్వప్రకాశులు స్వయముగా మంత్రద్రష్టలు కానోపుదురు గదా !

సుమంత్ర : వత్సా ! అదిగో ! వీరుఁడు సమీపించుచున్నాఁడు. సావధానముగా నుండుము.

ఇచ్వరుసు : (స్నేహానురాగములతో చూచికొని ఒండొరులను గూర్చి)—

కనంగా కామ్యంబై హృదయ మవధానించు బ్రియతన్
హఠాదాకర్షంబో సుగుణగణ పుణ్యాతిశయమో !
చిరస్యానే కాయాత జనన సుహృద్వృంత ఫలమో !
నిజాత్మస్నేహంబయ్యును తెలియదా దైవవికృతిన్.

సుమంత్ర : లోకములో ఒకరి నొకరు చూచినప్పుడు ప్రాయికముగా-ప్రేమ సంచార మగుట ప్రాణిధర్మము. దీనినే లౌకికులు తారామైత్రి

యనియు చక్షూరాగమనియు అందురు. ఇది అనిబద్ధమును అహేతు
కమును. ఐనను ప్రేమ యనియే భావింప తగును.

హేతువులు లేని ఈలాటి హృదయపక్ష
పాత మెందు ప్రతిక్రియాపళము కాదు;
స్నేహ మొక ఆత్మతంతువు స్నిగ్ధరచన
నతుకు నంతఃకరణముల నన్వితముగ.

కుమారులు: (ఒకరొకరిపట్ల)

మసృణరాజపట్టాంశుకప్రమదిమ మెఱయు
ఇతని మేన నారాచము లెట్టు లేయ?
నా తనువు పులకించి ప్రస్ఫీతమగును
అతని చూచిన పరిరంభణాభిలాష.

అధికాక్రాంతునిముం దికేది గతి శస్త్రాస్త్రప్రయోగంబు గా
క? ధనుర్విద్య లికేల యుక్తపురుషైకస్థానముల్ తప్పినన్;
రథినై కార్ముకధారినై విముఖినై నన్ పోర? ఏమాడు నీ
బుధుడిస్సీ! వ్యథియించు వీరసమయంబుల్ స్నేహధర్మంబులన్.

సుమంత్రి: (లవుని లక్షించి కన్నీళ్ళతో స్వగతమ్.) హృదయమా!
ఏటికిట్లు అడియాసలు కల్పింతువు?

ఏది మనోరథ బీజం
బో దాని నడచె విధి అదయుండయి మునుపే;
అది మొలచలంట కోసిన
పాదున తీవియ కికేటి ప్రసవఫలంబుల్.

చంద్రి: ఆర్య! సుమంత్రి! రథము దిగుచున్నాను.

సుమం: అది ఏకారణమున .... ....

చంద్రి : ఈ రూపముగా ఈ వీరపురుషుని పూజించుట యగును. అది గాక . . ఆర్యుల క్షాత్త్రధర్మమును పాలించుటయు తగును. రథస్థుడై పాదచారితో యుద్ధమాచరింపరాదని వేత్తలు పల్కుదురు గదా !

సుమంత్రి : (తనలో) హా ! కష్టమ్. ఆపత్తిలో పడితిని.

మే మనుష్ఠించిన ధర్మసామయికము
లెట్లు నేన నిషేధింతు - అట్లు గాక
అనుమతింతు నెబ్భంగి సాహస విపత్క
రాళ భవితవ్యమునకు ? మన్కాల మకట.

చంద్రి : మా తాతలకు మీరు ఆప్తమిత్రులు. మా తండ్రులు కూడ సందేహస్థానములలో మీ ఉపదేశమునే పొందుచుండెడివారు. అట్టి మీరేల ఇప్పుడు ఏదో ఆలోచించుచున్నారు.

సుమం : ఆయుష్మంతుడా ! రాజధర్మమెట్లో అట్లే నీవు ప్రవర్తించితివి.

ఇదె సాంగ్రామిక పురుషుల
నిదేశము - సనాతని వినీతస్మృతి యి
య్యదియే ! రఘుకుల సింహులు
వదలని మా వీరచరిత పద్ధతియు నిదే.

చంద్రి : ఆర్యా ! ఎదురులేనిమాట పలికినావు.

ఎఱుగుదు వితిహాస పురా
ణ రహస్య ప్రవచనము, రణక్రమ ధర్మా
చరణ, మెఱుగు దీవస్మత్
పర రఘుకుల వీర సంప్రదాయము లెల్లన్.

సుమంత్రి : (స్నేహబాష్పములతో కౌగిలించుకొని)

నీ తండ్రి లక్ష్మణకుమారుడు - ఇంద్రజిత్తుగా
పోకార్చ పుట్టిన దినాలవి యెన్ని వత్సా !
ఆ తండ్రి పుత్రుడవు పట్టితి వీర ధర్మా
చారం బిటుల్ - దశరథేంద్రు ప్రతిష్ఠ నిల్పేగా.

చంద్రి : (కష్టముతో)

రాఘవజ్యేష్ఠునకు కుమారప్రతిష్ఠ
లేక మా కులం బెట్లు నిల్చెడి ప్రతిష్ఠ
ననుచు దుఃఖాన తపియింతు రస్మదీయ
పితలు ముప్పూరు దైవోపహతికి మిగుల.

సుమం : కట్టా ! చంద్రకేతు పలుకులు అంతరాళశోకములను కోయుచున్నవి.

లవ : హంత : ఈ తీపిచేదులు కలిసి కలయవు.

ఇందుగా పొందిన తెల్లకల్వవలె నా దృష్టిప్రసారంబు ఆ
నందిం చీతనిముంగు. దుర్వారుకిణన్యస్తాంక మీ హస్తమో
అందగా సాచు జిఘాంసతో ఝణఝణాయాతక్వణచ్ఛింజిని
బృందిష్ఠంబను కూర కార్ముకము నాభీలాహవప్రీతిమై.

చంద్రి : ( రథము దిగి ) ఆర్య ! సవితృకుల సంజాతుడను. చంద్రకేతుడను. అభివాదము చేయుచున్నాను.

సుమంత్ర:

అజిత - మూర్ధస్వలమ్ము - పుణ్యాఢ్యమైన
ఋజుమహస్సు నీ భుజ మావహించుగాక,
తొల్లి యిక్ష్వాకులకు బోలె నెల్ల శుభము
లక్షయ వరాహదేవత యనుఘటించు.

మఱియు.

"తనియింపంగ త్వదీయగోత్రపతి మార్తాండుండు సంగ్రామపీ
ఠిని, మైత్రావరుణుం దెలచ్చి అభినందింపఁగా, మరుద్గాయడా
వనముల్, వైష్ణవ-మైంద్ర-మాగ్ని మహిమల్ ప్రాపింపగా, దిగ్జయా
ర్జనమౌ నీకిట రామలక్ష్మణ ధనుర్జ్యాధ్యానమంత్రశ్రుతిన్.

లవ : కుమార ! నీవు రథస్థుడవై మిక్కిలి శోభించుచున్నావు. ఇది అత్యంతమైన ఆదరము - నాకు చాలును.

చంద్ర : అట్లైనచో మహాభాగుడుకూడ వేఱొకరథమును అలంకరింప నగును.

లవ : ఆర్య ! రాజపుత్రుని రథముమీది కెక్కింపుము.

సుమం: నీవు కూడ మా వత్స చంద్రకేతుమాటను మన్నింపుము.

లవ : మా సామగ్రిని గుఱించి ఎందుకీ విచారణ. అరణ్యవాసులము ఆరదముల నడకలకు మేము అలవాటు పడలేదు.

సుమంత్ర : దర్పసౌజన్యములకు చాలిన అనువర్తనము నీవెఱుగుదువు. వత్సా ! ఇక్ష్వాకు కులీనుడైన మా రాజు - రామభద్రుడు - ఇటువంటి వానిని చూచినచో ఆయన హృదయము కరిగిపోవును.

లవ : తెలుసును. ఆ రాజర్షి సుజనుడని విందును. (లజ్జించినట్లు)

క్రతువిద్వేషము లేదు - వాని చెఱుపంగా నైజముఁగా కాదు, మా
కతి సౌజన్యనిధాన - మా నృపతి నీహారాంశు - మన్నింపదే
కితవుండేనియు; అశ్వరక్షకుల వాగ్భేరీరుతుల్ శాత్రిలో
క తిరస్కారములై ధ్వనింప - హృది ఉగ్రక్షోభమయ్యెఁ గ్రుధన్.

చంద్ర: (నవ్వుతో) ఏమీ! పితృపాదుల పౌరుషోత్కర్షలకే మచ్చరింతువా?

లవ : మచ్చరమపునో-కాదో. అది అట్లుండనీ, ఒక్క_మాట అడుగుదును. రాఘవుడైన ఆ రాజన్యుడు నిరహంకారి యని వినికిడి. ఆ ప్రభువు గర్వి కాడు. ప్రజలకును గర్వ ముండదు. కాగా ఆయనమనుష్యులు రాక్షసభాష నాడనేల ?

ఋషులందురి రాక్షస మని క
లుషోన్మదుని. గర్వితుని - పలుకు - నది యాపత్
విషమ కలహామూలము - మా
నుష నిష్కృతియు - నదియె యగును విచారింపన్.

ఇట్లు నిందించిరి కదా దీనిని - వారే తదితరమును కొనియాడిరి.

తీర్పున్ వాంఛల్, దూరగించున్ అలక్ష్మిన్,
కూర్పున్ కీర్తిన్, పోకడంచున్ అకీర్తిన్,
మాతం బోలెన్ మంగళంబుల్ ఘటించున్
పాలావట్టుల్ సూనృతం బార్యభంగిన్.

సుమంత్రి : ఇతడు పరిపూతమయిన స్వభావము కలవాడు. వాల్మీకి శిష్యుడు కదా ! ఋషులిచ్చిన సంస్కారము వలన చక్కగా పలుకుచున్నాడు.

లవ : మఱి - చంద్రకేతూ ! "మాతాతాపాదుల ప్రతాపోత్కర్షల పట్లనే మచ్చరమా" అని అంటివి కదా ! దాన నడుగుచున్నాను. చెప్పుము. "క్షాత్రధర్మము ఏకత్ర నిష్ఠమా ?"

సుమంత్రి : వత్సా ! దేవునివంటి ఇక్ష్వాకు కులీనుని నీ వెఱుగవు. అది అధికప్రసంగము. దానిని కట్టిపెట్టు....

సైనికచయంబు నోర్చి ఓజస్విపై ప్ర
కాశమందితి, సత్యమే కాని-అట్లు
జామదగ్న్యు జయించిన రామభద్రు
శౌర్యధృతి నీసడింపగా చాల వీవు.

లవ : (నవ్వుతో) ఆర్య ! పరశురాముని పరాభవించెనని? ఆ రాజు నెంతో గట్టిగా పొగడితివి.

బ్రాహ్మణులకు వాచాసరస్వతి బలంబు ;
క్షత్త్రియులకు బాహాదండ చండశక్తి,
శస్త్రమంటిన పాఱుడు జామదగ్న్యు
డతని గెలిచిన నృపునేటి కంత పొగడ.

చంద్రి : (మనోబాధతో) ఆర్య ! ఆర్యసుమంత్ర ! చాలు చాలు మాటలు పెరుగుచున్నవి.

ఎవడో యీ పురుషావతార మిటు లెంతే నీరసాలాడు భా
ర్గవు; నాఖిలకుతార ఘోరతరధారన్-సప్తలోకాంతరా
శవిపద్భీతి తొలంగి పో-అభయలీలారక్షణా దక్షిణా
కవచం బిచ్చిన రామ శైశవ పరాక్రాంతిన్ వికర్షించెడిన్.

లవ : రఘునాథుని చరితమునుగాని, మహిమను గాని ఎఱుగని దెవడు? అది చెప్పవలసినది కొంచెము కలదు. కాని ఎందుకులే ....

వారల్ పెద్దలు-రాదు వారి చరితల్ వాదాడ-అట్లుండనీ-
పేరుం బొందిరి సుందసుందరివధన్-వెన్కాడి మూడంగ లా
పోరాటన్ ఖరు నోర్వ-చాటు గొని రూపున్ మాపి రావానరున్
జూపట్-వారల కౌశలం బెఱుగు నీ క్షోణీజనం బంతయున్.

చంద్రి : ఓయీ ! పితృభాషణతో మర్యాదనతిక్రమించి - ఏమో ప్రేలుచున్నావు.

లవ : అయి ! బొమలుముడిచి-నావైపుతిరిగి ముఖము చిట్లించుచున్నాడు!

సుమంత్రి : ఆహా ! ఇరువురకు క్రోధము క్రిక్కిరించుచున్నది. అదే !

సడలెన్ ముందల కేశబంధము జయేచ్ఛల్ త్రుళ్ళ-చెంగల్వ కెం
పడరెన్ కన్నులయం, దకాల నటన వ్యత్యాసమై భ్రూతలల్
ముడివేయన్ కనిపించు మోము-భ్రమరంబుల్ రేగు పద్మంబుకై
వడి-నీలాంక కలంకమైన శశిబింబం-బు ల్లపూర్వాకృతిన్.

లవ : కుమారా ! రమ్ము-రమ్ము — పోరాటమునకు తగిన పాలివాటమునకు పోదము.

(అందఱు నిష్క్రమింతురు)

కుమార విక్రమ మను పంచమాంకము.



# షష్ఠాంకము

—০০:০০—

[ధగధగలాడు విమానము మీద విద్యాధరమిథునము ప్రవేశించును]

విద్యాధర : ఓహో ! ఇది సూర్యవంశకుమారుల ప్రచండ ఖండనము ఆకస్మికముగా అంకించినది. ఉద్దండమయిన ఈ క్షాత్రలక్ష్మీతాండవమునకు దేవదానవులు కూడా దిగ్భ్రాంతులై పోవుచున్నారు. సఖీ ; చూడు — ఈ వీరకుమారుల మధ్య .... ....

"ధనూరణిత కింకిణీభ్రమణ కంకణక్వాణముల్
గుణానురటన ప్రగాఢఘటనా కరాళధ్వనుల్
పెనంబడ, శరప్రయోగరభసణ్ణ పిగల్ త్రుళ్ళగా
ప్రవర్తిలు రణం బభూత జగతీ భయోత్పాతమై."

మఱియు,

ఉభయ సుమంగళముగ దుం
దుభులను మ్రోయింతురి సురలు దుంధుంధుమ సం
రభసం బానందముగా
నభోఘనకలాపమందరి నాదానుగతిన్.

లేత కెంపుల వంటి దేవతరు ముకుళ నికురమును – తరిపి తేనెలతో తడిసిన బంగారు తామర పూవులను – కలియబోసి పుష్పవర్షము కురిపింతము.

విద్యాధరి : ప్రియుడా ! ఏమిది. హఠాత్తుగా ఆకాశమంతా మిట్టాడుచున్న మెఱుపుల చెఱగులతో పసుపు పూసినట్లయింది.

విద్యాధర : ఔను. ఇప్పుడిదేమైయుండును.

విశ్వకర్మ యంత్రమున త్రిప్పించి త్రిప్పి
సాన బట్టిన మార్తాండు జ్వాలల వలె
మెండుకొన్నవి - గాలి ప్రచండ ఘాల
ఘటము పగిలిన కాలాగ్ని జటలొ? యేమొ.

(కొంచె మాలోచించి) ఆ - తెలిసినది. కుమార చంద్రకేతువు ఆగ్నే యాస్త్రమును విడిచెను. దాని జ్వాలాచ్ఛాయలివి. అట్లే....

రంగు రంగుల కాలురథాంగకేతు
చామరముల విమానముల్ జరిగె సపల;
ధ్వజములకు కట్టిన వసనాంచలము లాయె
నిముస మాత్రము కుంకుమ చమిరినట్లు.

ఇప్పుడీ రణప్రవర్తనము ఆశ్చర్యంగా ఉన్నదే? ఓహో! అత్యుగ్రంగా లేచినాడు అగ్నిదేవుడు. పగిలి బ్రద్దలైన పిడుగుల ముక్కల లాగా మండు నిప్పుకలు విసరుచున్నవి. త్రాళ్ళుయెత్తున లేచిన కోడెత్రాచుల వలె ఆభీలజ్వాలలు నాల్కలు సాచుచున్నవి. ఆ ప్రచండదాహము ఇక్కడికి కూడా దుస్సహంగా తగులుచున్నది. కాబట్టి— ప్రియురాలిని నా అంగములతో ఆచ్ఛాదించి దూరముగా తొలగిపోవుదును. (అట్లే చేయుచున్నాడు)

విద్యాధరి : ప్రియుడా! మంచి ముత్యాలదండ వేసికొన్నట్లు నీ దేహ స్పర్శ నాకు స్నిగ్ధ శీతలాప్యాయమాన మైనది. ఈ ఆనందములో ఉద్భ్రమించిన నా కన్నులు ఇంచుక వ్రాలుచున్నట్లున్నవి. అంతః స్సంతాపము కూడా అంతరించినది.

విద్యా : సఖీ! నేను చేసినదేమున్నది?

ఏమి చేయుచున్నను మనోభీష్టసమ్ముఖ
మాత్ర సుఖముచే దుఃఖముఁ బాపగలుగు;
తత్ప్రియజనంబుకంటె సాంత్వన మొసంగు
ప్రియమయిన ద్రవ్యమేది జీవితమునందు.

విద్యాధరి : అయి ! ప్రియా ! ఇదేమిటి ? ఆకాశమండలమంతా మదించిన నెమిలికంఠము కాగా శ్యామలములైన మేఘము లావరించినవి. తెంపులేకుండా మెఱుపుతీగెలు త్రుళ్ళి తెగి చెల్లాట లాడుచున్నవి.

విద్యాధర : లవకుమారుడు వారుణాస్త్రము ప్రయోగించినాడు. దాని ప్రభావమిది. సందులేని సహస్రధారాపాతము వలన ఆగ్నేయాస్త్ర మెంతలో చల్లారిపోయినదో చూచితివా !

విద్యాధరి : ఇది నాకు సంతోషము.

విద్యాధర : హంత ! హద్దు దాటినదంతా దోషమే అగును. ప్రచండ వాతఘాతకు క్షోభిల్లి పెనబడి గణగణగర్జించు నీళ్ళమబ్బులతో నిండి నిబిడమై అంధకార మతినీరంధ్రమయింది. అందువలన ప్రాణిలోక మంతా మొత్తంగా అడ్డగింపబడి — జగద్భక్షణకై నోరు విప్పిన కాళ రుద్రుని ఖరకంఠబిలమున చిక్కుబడినట్లు — యోగనిద్రాకాలమున అన్ని వాకిళ్లను మూసికొన్న నారాయణ మహోదరములో ఇరికికొన్నట్లు-ఉక్కిరిబిక్కిరి యగుచున్నది. బాగు-చంద్రకేతూ ! వత్సా ! స్థానమెఱిగి వాయవ్యాస్త్రమును వదలితివి.

తెలివి నేసినట్టి దివ్యాస్త్రమరుతుల
విలయమయ్యె మేఘవితతి యెల్ల.
బ్రహ్మమందు వివిధ బహుళ ప్రపంచక
సంచితము శమించు చందముగను.

విద్యాధరి : నాథ ! ఈయన ఎవరో ? అతి సంభ్రమముతో స్వహస్త కోదండము త్రుళ్ళింత లాడగా దూరమునుండియే తియ్యనికంఠముతో వీరి పోరాటము నాపివేయుచు — వీర కుమారుల నడుమ దివ్య విమానమును దిగుచున్నాడు.

విద్యాధర : (చూచి) ఓహో ! ఈయన రఘుపతి ! శంబూకవధ సలిపి మరలి వచ్చుచున్నాడు. ఆహా !

ఆలించి మహాపురుషు హి
తాలాపమును, లవు డాలమాపె : సతుం డై
వ్రాలె నటు చంద్రకేతువు;
చాలి శుభం బొదవు సుతులసరస విధునకున్.

కావున - నీ విటురమ్మ - పెట్టుదము.

[విద్యాధరమిథునము నిష్క్రమించును]

విష్కంభము

[ లవ చంద్రకేతులు ప్రణతులుగా— రామభద్రుని ప్రవేశము ]

రామ : (విమానము దిగి)

సవితృకుల రాజచంద్రమా ! చంద్రకేతు !
రమ్మ శీఘ్రము కౌగిలి నిమ్మ నాకు
ఆఱుగాక నా చిత్తదాహమ్మ నీదు
హిమశకల శీతలామలాంగములు సోకి.

(స్నేహాశ్రువులతో కౌగిలించుకొనును) అలౌకికాస్త్రములు సహించిన నీ శరీరమునకు కుశలమా ?

పందరి : కుశలమ్. అదృష్టవశమున అద్భుతప్రీతిస్థాన మయిన ప్రియ వయస్యుడు లభించినాడు. అతనిని మీరు నన్ను వలెనే లేక అంత కంటె విశేషముగా మంగళ వీక్షణములతో చూడమని, విన్నవించు కొనుచున్నాను. ఇతడే ఆ మహావీరాంకురము.

రామ : ( లవుని పరికించి చూచి ) వత్సకు సంప్రాప్తమయిన ప్రియ మిత్రుని ఆకృతి అతి గంభీరముగా నున్నది....

తనువుఁ దాల్చిన అస్త్రవేదమొ జగత్త్రాణార్థమై ; రూపమం
దిన సుక్షత్త్రియ ధర్మమో నిలుప శాంతి బ్రహ్మకోశంబు ; దే
వనసామర్థ్య సమస్తసంస్కృతియొ ; యాపత్సద్గుణామ్నాయమో
యన నావిర్భవమందనోపు నిటు పుణ్యప్రాప్యసాకల్యమై.

లవ : (స్వగతమ్) ఈ మహాపురుషుని సందర్శనము బహుపుణ్య బహు మానముగా స్ఫురించుచున్నది.

స్నేహ విశ్వాస భక్తివిశేషములకు
నిలువ యేకాయతన మిటు వెలయనోపు,
జగదుదాత్త ధర్మప్రసాద గరిమంబు
మూర్తిమంతము కానోపు భూతలమున."

ఆశ్చర్య - మాశ్చర్యమ్ ;

విరోధంబుల్ విశ్రాంతిగొనె - సరసప్రీతి తోఁ జెకెఁ,
మనోద్దౌత్యంబెందో సురిగె - వినయీభావ మెనసెఁ,
పరాధీనం బయ్యెఁ ఝుడితి హృది - ఈ ధీరు నరయఁ
మహత్త్వం బేదో యొప్పు బుధులకడఁ దీర్థములటుల్.

రామ : ఏమిది! ఒక్క మాటుగా నా దుఃఖము దూరమైనది. ఏదో నిమిత్తము ఉండనోపు. అంతరాత్మ కూడా స్నేహించుచున్నది. కాదు - స్నేహోదయమునకు నిమిత్తమక్కరలేదు.

అంతఃకారణ మేదో ప్రాణులను అన్యోన్యంబు సంధించు. ఆ
వంతైనగా పయి రూపురంజనలు స్నేహాలంబనల్ కావు. భా
స్వంతుగాచూచిన విచ్చు పద్మిని శుభాస్యచ్ఛాయ, శీతాంశు భా
సంత స్పర్శమునగా ద్రవించు నఖిలాషగా చంద్రకాంతాళియున్.

లవ : చంద్రకేతూ! ఈయన ఎవరు?

చంద్ర : నెచ్చెలీ! ఈయన మా తాతపాదులు.

లవ : నన్ను 'ప్రియవయస్యా' అంటివికదా! కావున నాకును వీరు పితృపాదులగుట ధర్మము. అయితే, రామాయణ కథాపురుషులు నలుగురున్నారుకదా నీకు పితృపాదులు. వారి అంతరవిశేషములు చెప్పెదవా!

చంద్ర : ఆ - అందఱిలో ఈయనయే మా పెదనాయన.

లవ : (ఉల్లాసముతో) ఏమీ! ఈయన రఘునాథుడా! ఎంతభాగ్యమ్. ఈ దేవుని దర్శన మయినది. ఇది సుప్రభాతమ్. (వినయకౌతుకములతో రామచంద్రుని చూచి) తండ్రీ! ప్రాచేతసశిష్యుడు — లవుడు అభివాద మర్పించుచున్నాడు.

రామ : ఆయుష్మంతుడ వగుము. రా - రమ్ము! (ప్రీతితో కౌగలించుకొని) అయి, వత్స! చాలు - చాలు — వినయ మత్యంతమ్. నన్ను గట్టిగా కౌగిలించుకొనుము.

పూచి పొదలెడి తెలితమ్మి పువ్వులోని
తల్లి తే కట్లు మెత్తనై తనువు నీదు

మేను సోకి ఆనందించు లోని యాత్మ
చంద్ర చందనసారముల్ చల్లినట్లు.

లవ : (తనలో) "ఈయనకు నామీద ఇలాటి అకారణ స్నేహమున్నది. నేనో - అజ్ఞానుడనై - ఇట్టివారికి అపచారము కావించితిని. ఆది నుండి ఆయుధమెత్తువలకును నాచర్య దుర్యోగము. ఇది ధ్రువమ్." (ప్రకాశముగా) పూజ్యులను తండ్రిలు ఈ లవుని బాలిశత్వమును క్షమింపవలెను.

రామ : బిడ్డా ! నీవు చేసిన అపరాధమేమి !

చంద్ర : అశ్వరక్షకులు తాతపాదుల ప్రతాపప్రకర్ష కావింపగా ఈతడు వీరావేశముతో లేచెను.

రామ : ఓ .... ఇది క్షాత్త్రమున కలంకారము.

ఒక తేజస్వి సహింపబో డితర తేజోత్థాపనావ్యాప్తి. క్షా
త్త్రికులాచార-మకృత్రిమం బది స్వభావం, బా దినస్వామి ధీ
రకరజ్వాలల తాపముం బెఱప నక్రాంతిం శుచిగ్రావముల్
నికృతిం బొందిన యట్లు నిప్పుకలు వాంతిం జేయగా నేటికో.

చంద్ర : తాత ! ఈతని అసూయ కూడ అలంకృతమే అయినది. చూడుడు. ప్రియవయస్యుడు విక్రమించి ప్రయోగించిన జృంభకాస్త్రముతో నా సర్వసైన్యసంతానమును స్తంభితమై పడియున్నది.

రామ : (చూచి) వత్సా ! లవ ! అస్త్రము నుపసంహరింపుము. చంద్రకేతూ ! నీవు కూడ - కదలమెదలలేక బాధపడుచున్న బలములను ఓదార్చుము.

లవ : (ఆనతిచ్చినట్లు అని అభినయించును.)

చంద్ర : ఆజ్ఞాపించునట్లే. (అని నిష్క్రమించును)

లవ : తండ్రీ ! అస్త్రము శాంతించినది.

రామ : (స్వగతం) జృంభకాస్త్రముల ప్రయోగసంహారరహస్యములు ఈ బాలునకు తెలుసును. (ప్రకాశముగా)

బ్రహ్మాతోడ పురాణదేవతలు మున్ను
వేలవేలేండ్లు తపసు గావించి దీక్ష
వేద సంరక్షణార్థమై వీని గనిరి !
ఆత్మతేజస్సులు తపోమయములు గాగ.

ఉపనిషత్ప్రాయమైన ఈ అస్త్రముల మంత్రపారాయణమును భగవాన్ కృశాశ్వుడు — తనకు వేయేండ్లుగా శుశ్రూష చేసిన విశ్వామిత్రునకు - చెప్పెను. ఆ మహనీయుడు నా కనుగ్రహించెను. ఈ మహాస్త్రక్రమ మిది. ఇక కుమారుని సంప్రదాయ మేదో తెలియ నగుచున్నాను.

లవ : ఈ యస్త్రములు మాకు తమంతట తామే ప్రకాశించినవి.

రామ : (సాలోచనుడై) ఏల కాకూడదు — పరమపుణ్యపరిపాక మేదో ఒక మహిమాసిద్ధి ఉండవచ్చు. కుమారా ! 'మే' మని ద్వివచన మేల పలికితివి ?

లవ : మేము ఇద్దఱ మన్నదమ్ములము. కవలము.

రామ : అట్లైన రెండవ వాడెక్కడ ?

(నేపథ్యమున)

కవియఱ రాజచమూసమూహము లనేకంబుల్-చిరంజీవి మా
లవు డాయోధనమం దెదిర్చెనె సఖుండా ! చెప్పు మా మాట ! ఈ
భువనంబందున రాజశబ్ద ముడి వోవుఱ నేటితో - క్షాత్రి శా
త్రవ శస్త్రాస్త్ర దవానలప్రకర మాద్యంతంబు చల్లారెడిన్.

రామ : ఎవ రీ బాలకు డింద్రనీలమణిమచ్ఛృంగారముల్ తేఱు - ప
ల్కు వినఁ బుల్కలు క్రమ్మి కౌతుకముజాలుల్ వా ఱుసర్వాంగముల్,
నవనీలాంబుద మందర స్తనిత సంధానోత్సవాభోగ ప
ల్లవమై కన్నుల విందుగా కదలులీలాబాలనీహాకృతిన్.

లవ : ఈయన మా జ్యేష్ఠసోదరుడు - కుశుడు. భరతాశ్రమము నుండి తిరిగి వచ్చుచున్నాడు....

రామ : (కౌతుకముతో) వత్సా ! ఆ చిరంజీవిని ఇటు పిలువుము.

కుశ : ఆలాగే — (పరిక్రమించును)

(హార్షధైర్యోల్లాసములతో వింటిని మ్రోయించుచు ప్రవేశించును)

కుశ : అల వైవస్వతు డాదిదైవతకులాధ్యక్షాభయం బిచ్చి, మాం
సల దర్పోద్ధతులఁ దహించి సహజక్షత్త్రిప్రతాపాగ్ని - శో
భిలి రాదిత్యులు - వారి ని ల్లెదిరి, నా విల్లింక ధన్యంబగున్;
లలిత జ్యాజ్వల దస్త్రదీధితుల మాలల్ నిండు నివ్వాళిగాన్,

(ఉద్ధతితో పరిక్రమించును)

రామ : ఓహో ! ఏ మీ క్షత్త్రియపోతమునందున్న పౌరుషము ! అనితరంగా, అతిరేకంగా తోచెడిని. అల్లే ....

ముల్లోకంబుల వీరసత్వము తృణీభూతం బగుఁ జూపులఁ,
పల్లంబై భువి క్రుంగు ఉద్ధతపదాపాతంబు భారంబునఁ,
అల్లారుం బసిప్రాయమందె గిరికాయస్ఫూర్తిమై వచ్చెడిన్
త్రుళ్ళుంబో తయినట్టి వీర రసమో ! దుర్దాంత దర్పంబొకో.

లవ : (కుశుని సమీపించి) అన్నగారికి జయము.

కుశ : చిరంజీవీ ! ఎక్కడిదీ యుద్ధవార్త.

లవ : అది అంతపాటిది కాదులే - సోదరులు ఇంచుక దర్పభావము నపసరించి - వినయ మూనవలెను.

కుశ : ఎందుకోసము ?

లవ : దేవునివంటి రఘుకులపతి ఇక్కడ ఉన్నాడు. ఆయన మన ఇరువురిమీదను పూర్ణమైన స్నేహభావము చూపుచున్నాడు. నిన్ను సన్నిహితంగా చూడవలెనని వేగిరపడుచున్నాడు.

కుశ : (సవితర్కంగా) ఓ — ఆయన రామాయణ కథానాయకుడు. బ్రహ్మకోశ పరిత్రాత.

లవ : మరి — ఇంకేమి.

కుశ : ఆ మహనీయుని దర్శనమే పుణ్యకృతము. కాని వారి నేప్రకారము సమీపింపవలెనో యని ఆలోచించుచున్నాను.

లవ : గురువులదగ్గరవలె ఉపచరింప నగును.

కుశ : ఓయీ ! అదెట్లు సంగతమ్.

లవ : ఏమన ! ఉదాత్తుడు - సుజనుడు - చంద్రకేతు - ఊర్మిళాతనూజుడు నన్ను 'ప్రియవయస్యా' అని పిలిచి సంభావించుచున్నాడు. ఆ సంబంధము వలన ఈ రాజర్షి మనకు తాత యగుట ధర్మము.

కుశ : అలాగయితే — రాజన్యుడైన ఆయనను వినయముతో భావించుట నింద్యము కాదు.

లవ : ఆర్య ! చూడుము. ఈ మహాపురుషుని సౌమ్యదర్శనముచేత - గంభీరానుభావముచేత - ఈయన వివిధలోకోత్తరచరితు డనిపించును.

కుశ : (లక్షించి చూచి)—

ఓహో! రూపు ప్రసన్నమ
నోహరము. ప్రభావము లభినుతపావనము గా
దోహదమై రామకథా
వ్యాహృతికిన్ మునిముఖ భగవతి నందివాంచెన్

(సమీపించి) తాత! ప్రాచేతసశిష్యుడు కుశుడు అభివాదము చేయుచున్నాడు.

రామ: చిరంజీవి! రమ్ము — రమ్ము.

అమృత పరిపూర్ణ జీమూ
తమువలె స్నిగ్ధంబవగు నిను తనివారగ ప్రే
మముతో కవుంగిలింపగ
సముత్కటముగ నిపుడు మనసా కాంక్షింతున్.

(కౌగిట చేర్చుకొని - తనలో) ఏమిది! ఈ చిన్నవాడు —

అంగాంగంబుల జాలువారెడి నిజదేహస్నేహసారంబు - ఉ
ప్పొంగెన్ బైటికి జీవధాతువులు రూపుంగొన్నయట్లై - యెడం
దం గాఢోన్మథనన్ జనించిన సుధానందాపగన్ బోని ఈ
మంగల్యాంగుని కౌగిలింత తడుపున్ మంపిల్లి నన్నియ్యెడన్.

లవ: తండ్రి! నడియెండకు ఫాలభాగములు కాలుచున్నవి. ఇంచుక ఈ మద్దిచెట్టు నీడను తాతపాదులు కూర్చుండవలెను.

రామ: వత్సా! నీ కిష్టమెట్లో అట్లే....

(కొంచెము నడచి యథోచితముగా కూర్చుండును. (స్వగతం)

నడకలు - ప్రవేశములు - ఆసనక్రమములు
ఈ కుశునివట్లను - లవునియెడను కాను

పించు - వినయప్రయుక్తి నొప్పిదము లసించు:
పూర్ణసామ్రాజ్యలక్షణములు స్ఫురింప.
సహజమగు తనూకాంతుల్ ప్రకర్షించుశోభల్
నిముస నిముస మున్మేషించు నెమ్మేని నిగ్గుల్.
విపులమయిన వన్నెల్ విచ్చురత్నంబు లీలన్ -
విరియు కమలమంజుబింబపు క్రొంచేనెలట్టుల్.

వీరిలో రఘుకుల కుమారుల ఛాయలు పుష్కలంగా చూచు చున్నాను. (అగపడుచున్నవి)

పడుచు పావురాలమెడవోలు తనుకాంతి,
కోడెమూపురముల కొమరారు సంసములు,
చేరచూపు స్తిమిత సింహావలోకనము
కంఠరుతి మృదంగ కమనీయ కలరవము ॥

(పరకాయించి చూచి)

నిపుణముగా గణించి గమనించిన వీరల వాలకంబునన్,
విపులముగాస్ఫురించు అవనీసుత కప్పనమైన పోలికల్.
ఇపుడును గోచరించెడిని ఎట్టెదుటన్ ప్రియురాలి శ్రీముఖం
బపచితమై ఉషస్సుభగమైన సరశ్శతపత్రశోభలన్.
ముత్తెములట్టు లచ్ఛమయి మొల్కలు తేలిన దంతపంక్తులున్,
మెత్తని మోవితీగెరుచి మేల్మియు. మంగళ కర్ణపాశముల్,
ఎత్తిన యట్టులున్న 'వవియే యివి' నాతగి భాగ్యలాంఛనల్;
పొత్తయి కావికాటుకల పోణిమి రేఖలు మీఱు కన్నులన్ ॥

(దీర్ఘముగా చింతించుచు)

ఇది వాల్మీకి మహర్షి నివసించు అరణ్యము. ఈ సమీపముననే కదా! దేవి సీత పరిత్యక్త అయినది. ఈ పసివారి రూపరేఖలును అవియే. ఇక అస్త్రములమాట. అవి తమకు స్వతః ప్రకాశములనిరి వీరు. అయితే, మునుపు చిత్ర దర్శనకాలమున అస్త్రప్రాప్తికి నే నిచ్చిన అభ్యనుజ్ఞ కలదు. అదేమైనా సిద్ధించియుండునా! అసంప్ర దాయకముగా అస్త్రప్రాప్తి యైనట్లు పూర్వకాలమునందును వినము. ఇప్పుడు సుఖదుఃఖాతిశయములో మునిగి తేలుచున్న హృదయము నన్నెట్లో నమ్మించుచున్నది. ఇది ఇట్లుండగా - దేవి గర్భభారము రెండుగా ఉన్నట్లు తొలుతొలుత నేనే గమనించితిని.

చిరచేతోరతి మేలసంబయిన మాస్నేహంబు నందొక్కత
త్పరవేళన్ నిమురంగ తోచెనట గర్భగ్రంధి రెండైన యు;
ట్లలవాలుంగనుదోయితోడ సతి లజ్జాధీనయై యుండె - అ
లెఱుగంతంత నెఱింగె తానును విధాతృప్రేషణాధారణన్.

(ఏమ్చుచు) ఏదేని ఉపాయాంతరమున వీరిని అడిగిచూతును.

లవ: తండ్రీ, ఇదేమి.

త్రిభువన మంగళ మగు మీ
ప్రభువదనము బహుళ బాష్పబాధితమగుచున్
రభసించి - మంచుముంచిన
ప్రభాతరాసారపద్మభరము వహించెన్.

కుశ: తమ్ముడా!

ఎది దుఃఖార్థముకాదు రాఘవునకిస్సీ! దేవి వైదేహి లే
నిది - దగ్ధాటవి యయ్యె సర్వజగమున్ సీతావినాశంబుతో.

పదిలే దీయెడబాటు - కాచెలిమిలోతు జెప్పగా భాష కం
దదు. రామాయణము బఠింప వారొ వత్సా! ఇట్లు ప్రశ్నింపగ.

రామ: (స్వగతం) బాలుని పలుకుబడి అప్రస్తుతంగా ఉన్నది. ఇక ప్రశ్న లెందుకు? దగ్ధహృదయమా! ఎందుకీ ఆకస్మిక వికారములో ఈదు లాట! భగ్నహృదయుడైన నాదుఃఖావేగమునకు అర్భకులు కూడ అనుకంపితు లగుచున్నారు. కానీ! దీనిని లోలో నడచుకొందును. (ప్రకాశముగా) వత్సలారా! వాల్మీకి ముఖభారతి రామాయణకీర్తన మాలపించెనని విందుము. అది ఆదిత్య వంశీయుల చరితము. అందులో ఏదేని వినుటకు వేడుక పడుచున్నాను.

కుశ: ఆగ్రంథమంతయును మేము పఠించితిమి కాని ఇః నిముసము నందు రెండు పద్యాలు మాత్రమే స్మృతికి వచ్చుచున్నవి. అవి బాలకాండ చరమ సర్గలోనివి.

రామ: వానినే పఠింపుము.

కుశ: ప్రకృతిచే సీత ప్రియయయ్యె రాఘవునకు
రూపగుణవృత్తి నా ప్రీతి రూఢి నెదిగె -
అట్లె రాముడు సీతకు ప్రాణపదము:
ఎఱుక తత్ప్రీతియోగము హృదయములకె.

రామ: కష్టమ్ ఈఘాత హృదయమర్మముల కతిగాఢముగా తగులు చున్నది. హా దేవీ! ఆనాడు ఇట్టి ఘోరమే జరిగెను గదా! ఆహా, ఈ సంసార వృత్తాంతము లన్వయింపరాకున్నవి. ఎంత విపర్యాసములో అంతవిరసములై శోక పర్యవసానములై వహించు చున్నవి.

కడలేనట్టి కడాని నచ్చికల చక్కంబడ్డ ఆనందమె
క్కడ? అన్యోన్య సరాగమేడ? కుతుకా గాఢామృతాస్వాదమె

రక్కడ ? ఎండా సుఖ దుఃఖ భాగహ్మాదయైకస్థాయి ? పాపాలదా
పడు నీప్రాణము లిప్పుడేనియు కటా! స్పందించు స్తంభింపవే.

కటా ! అతికష్టమ్ ........

ప్రియురాలి రూపగుణసము
దయము కరిమకరిమముగా పొదలికొాసు నమీవా
దయములు నాస్మృతికిఁ త
ట్టియు నిపుడు స్మరింప నతికఠినములగు కటా.

నవనవలాడుచుఁ దినదినంబు మృగేక్షణ కన్నెపాయముఁ
బ్రవిలసనంబుపై బిగువుపాలు, స్తన ద్వయమంతకంత కె
క్కువ బిగి విస్తరింప - మదకోలలతో నవ స్నేహకామనల్
తవిలెను లోన, మీద ముగుదంబలె లేతరికంబె నిల్వగన్.

కుశ : ఇది రఘుపతి సీతాదేవి నుద్దేశించిన శ్లోకము. అప్పుడు వారు మందాకినీ తీరమున చిత్రకూట వనవిహారములో నుండిరి.

నలువైపుల జంపుల పు
ప్వులు చల్లగ పొగడ చెట్టు, పొలుపారెడి రః
తెలిరాతి పలక, నీ కను
గలముగ నమరెచిన తిన్నెగా నగపట్టుఁ॥

రామ : (లజ్జా - స్మిత - స్నేహ కరుణాత్మకుడై)

వీరు అథము శుభము నెఱుగని అతిముగ్ధులు. పైగా అడవిలో పుట్టిన బిడ్డలు. ఆహా ! దేవీ ! తలచుకో గలవా ! ఆ ప్రదేశమును ఆతరుణ తన్మయ ప్రసంగమును - అందున్న సాక్ష్య చిహ్నములను - కష్టమ్ - కష్టమత్యంతమ్ - హా !

అలంతల చెమర్చి చల్లబడి - అల్లమందాకినీ
సమీరచలితాలకాలికతలీ మృగాంకాంకమై,
నిరాభరణ కర్ణపాశమున మించు నీ యాస్యమున్
స్మరించెదను లుప్తకుంకుమముద్రైన చెక్కిళ్ళతో.

(నిశ్చేష్టితుడై - దుఃఖముతో)

అహో! ఏమిదీ.

అతిదీర్ఘంబుగ నిర్వికల్పరతి నధ్యాసించి ధ్యానించి రః
స్నితఘూయంబును పొందరేమొ విధువల్ ప్రేయః ప్రవాసంబులన్
హతమైపోవ కళత్ర మీ జగతి శూన్యారణ్యమై మాతె - వి
ట్టు తపించున్ హృది దాలిలోనుడుకు నట్టుల్ మెల్లగా గ్రుస్సుచున్.

(నేపథ్యమున)

అదె వాల్మీకి వశిష్ఠు లా దశరథ ప్రాణేశ్వరుల్ వెంటరా
ముదిమిన్ సోలు చరుంధతీ జనకులున్ ముందాడ - విచ్చేతు ర
ల్లదిగో బాలుర కయ్యమున్ విని భయాయాసత్వరన్ చిత్తముల్
అదరన్ పల్ల జడల్ తడంబడ సుదూరాధ్వశ్రమల్ సైచుచున్.

రామ : ఏమీ! భగవతి అరుంధతి - వశిష్ఠ గురుపాదులు - మా మాతృదేవతలు - పూజ్యుడు జనకుడు కూడా-అహో! వీరందఱును ఇక్కడ ఉన్నారా! వారిని చూచుట ఎట్లు? (వారివైపు విషాదముతో చూచి) ఆ - తండ్రి జనకుడు సైతము వచ్చుచున్నాడు. హా! మందభాగ్యడను. వజ్రఘాతమే తగిలినది.

తగువియ్యంబని మెచ్చ చుట్టములు - గోత్ర జ్యేష్ఠులన్ గూడిపం
డుగుగా పెండిలిచేసి రా జనకు లట్టుల్ వారలన్ చూచియున్;

తగునం చీ దురితాత్యయంబయిన మీదఁ జూతు నేమోముతో
పగులఁబోదు సహస్రధా హృదయమోపన్ తే దికే ఘోరముల్.

(నేపథ్యమున)

ఆహా - కష్టమ్ - కష్టమ్.

నిజసముజ్జ్వల శోభల నిగ్గుమాసి
మూఱురూపైన రఘుపతి చాల జూచి
మూర్ఛిలిరి వారు - జనకుడు ముందు లేచి
తేర్చ తల్లులు క్రమ్మఱ తెరలి పడిరి.

రాము : జనక రఘుకుల గోత్ర ప్రసన్న పూర్ణ
మంగళజయంతి యెడ జాలిమాలి విడిచి
పాపినైనాడ, ఇప్పుడీ పతితుపట్ల
కృప తలంచుట అస్థాన కృతముకాదె॥

పోయి వారిని సంభావింతును. (లేచుచున్నాడు)

కుశలవులు : తండ్రీ! ఇటు - ఇటు - ఈలాగు -

(దుఃఖవ్యాకులములతో నడచుచు అందఱు నిష్క్రమింతురు.)

కుమార ప్రత్యభిజ్ఞానము.

# సప్తమాంకము

[లక్ష్మణుడు ప్రవేశించును.]

ఓహో ! ఎందుకోసమో ! ఈ భగవాన్ వాల్మీకి ఆమంత్రణము. బ్రహ్మ క్షత్రియ పౌర జానపదులైన యావత్ప్రజాసమాజమును పిలిపించినాడు. అంతేకాదు. దేవరాక్షస నాగలోకమంతయును తమ తమ నాయక సహితముగా సాక్షాత్కరించినది. పశుపక్షి సంతానము కూడా వచ్చి నిలిచినది. ఇదీ అదీ అననేల సృష్టిలోని సకల చరాచర భూత బంధమును ఇప్పుడు - ఇచ్చట - ఉపస్థితమై యున్నది. ఆహా ! మహర్షి పలుకుబడి ప్రభావము.

అందుకే .... అన్నగారు నన్నిట్లు ఆజ్ఞాపించినారు. "వత్సా ! మహర్షి వాల్మీకి స్వయంగా రచించిన కృతిని అప్సరసలు నేడు విధి నయింప నున్నారు. ఆయన మనల నాహ్వానించిరి. కావున - నీవు ముందు వెళ్ళి భాగీరథీతీరమున మంచి మైదానమునందు సామాజికులకు ఉపవేశస్థానముల నేర్పాటుచేయుము." ఆ ప్రకారమే నేను మానవులకును - ఇతరులకును - ఆయా తావు లేర్పాటు చేసితిని.

అదిగో -

రాజ్యమున వసించియును ఆశ్రమమునవలె
సంభవంబగు మునుల కష్ట వ్రతంబు
జరుపు - నార్యుడు - రఘుపతి అరుగు దెంచు
కవలి వాల్మీకి పైగల గౌరవమున.

(రాముడు ప్రవేశించును.)

రాము : వత్సా ! రంగప్రేక్షకులు వారి వారి స్థానములలో కూర్చుండిరా ;

లక్ష్మ : ఆ .... మరేమి.

రామ : ఈ బాలకుల నిద్దరినీ మన చంద్రకేతువుతో సమానముగా ఆసీనుల కావింపుము.

(లక్ష్మణుడు వారిని కూర్చుండపెట్టును.)

లక్ష్మ : ప్రభువాత్సల్యమునకు అనుగతముగానే వారిని సంభావించితిని. ఇదిగో - రాజాసనము అమరియున్నది. రాము ఆసీనులు కాదగును.

రామ : (కూర్చుండును.)

లక్ష్మ : నటీనటులు ఇక ప్రారంభింప వచ్చును.

సూత్రధారి - (ప్రవేశించి)

భూతార్థవాది భగవాన్ ప్రాచేతసుడు సమస్త చరాచర జగత్తుకు ఇట్లు ఆదేశించు చున్నాడు. వినుడు. "నేను ఆర్ష చక్షుస్సుతోచక్కగా చూచిన ఇతివృతము ఇది కరుణ అద్భుత రసములతో కందళించు పవిత్ర ప్రబంధము. దీనిని మీరు గౌరవముతో అవధానింపవలెను"

రామ : ఈ జాగ్రద్వాచకము సమంజసంగా ఉన్నది. ఏమన - మహర్షులకు ధర్మార్థ విశేషము స్వయంగా ప్రకాశించును. వారి వాక్కులు అమృత ప్రవాహములు. అవి రజోమలినముగాని భూమికనుండి అవతరించును. వేళకాల ప్రతిబద్ధములవలె వానిని శంకింపక స్వీకరింప నగును.

(నేపథ్యమున)

హా ! ఆర్యపుత్రా ! కుమార లక్ష్మణా ! నేను ఒంటరి దాననైతిని మందభాగ్యను. ఇది మహారణ్యము. శరణ్యముగపడదు. ఆశలడగ్గి సన్నగిల్లినవి. ఆసన్నమైనది ప్రసవవేదన. ఈ దుర్దశాభర మోప లేక భాగీరథీ గర్భమున దాగుచున్నాను.

లక్ష్మ : కటకటా ! ఈ కష్టసంకటములో మాట మఱొక కఠోర పాతమ్.

సూత్ర : విశ్వంభరాత్మజ, జగద
ధీశ్వరి రఘుపతి త్యజింప నేరముగ వనిఁ,
నిశ్వాసించుచు పడె. గం
గా స్వేతధునిఁ ప్రసూతి కష్టవ్యథతో.

(నిష్క్రమించును.)

రామ : (ఆవేగముతో) హా దేవీ ! హా ! వైదేహీ ! లక్ష్మణా ! చూడు-చూడు.

లక్ష్మ : ఆర్య ! మీరు చూచుచున్నది నాటకము.

రామ : హా ! దేవీ ! దండకారణ్య ప్రియసఖీ ! ఇది రామసాహచర్యము వల్ల నీకయిన దుర్విపాకము

లక్ష్మ : ఆర్యపుత్ర ! ఓపికపట్టి - చూడుడు. ఈ ప్రబంధార్థమును పరిశీలింపుడు.

రామ : అలాగే నేను పాషాణమునై పోతిని. అన్నిటికిని సిద్ధమ్.

(అపుడు మూర్ఛించిన సీతతో-పృథివీగంగలు చెరియొక బిడ్డనెత్తి కొని ప్రవేశింతురు.)

రామ : వత్సా : లక్ష్మణ ! కాలిడరాని కఠినాంధకారములో చొరపడి పోతున్నాను. కారణము కానరాదు. ఆకస్మికమ్. ఇదిపలుకెటిగినది కాదు. నన్ను పట్టుకో ....

దేవతలు :

ఓపిక పూనుము కళ్యా
ణీ ! పండెను నీ యదృష్టమెల్ల - కొడుకులఁ

ఆపః పూతుల కంటివి
దీపకు లీకవలు - రఘుకులంబునకున్.

సీత : (తెప్పరిల్లి) అబ్బా - ఇ బిడ్డలు పుట్టిరి.
హా ! ఆర్యపుత్ర -

లక్ష్మణ : (రాముని పాదములదబడి)

ఆనందమ్ - ఆనందం మన యదృష్టము ఫలించినది. వంశమున కళ్యాణము మోలెత్తినది. (పరికించిచూచి) హా! ఏమిది ? ఆర్యుడు - పొర్లుచున్న బాష్ప పీడాభారముతో - శోభిల్లి .... మూర్ఛిల్లినాడు. (విసరు)

దేవతలు : బిడ్డా ! ధైర్యము తెచ్చుకొనుము.

సీత : (తెలివితెచ్చుకొని - నిట్టూర్పుతో)

భగవతీమతల్లారా ! మీరిద్దఱును ఎవరో తెలియదు. నన్ను వదలండి ....

పృథివి : ఈమె గంగ .... మీమామగారి కులదేవత ....

సీత : భగవతీ వందనము.

భాగీరథి : నీవ్వురిత మిచ్చిన కళ్యాణముతో పచ్చగిల్లుము.

లక్ష్మ : అనుగ్రహింప బడితిమి ....

బాగీరథి : ఈమె నీ జనని. విశ్వంభరాదేవి.

సీత : హాతల్లీ ! ఇలాటి దిక్కుమాలిన దశలో నిన్ను చూడవలసి వచ్చెను.

పృథివి : పుత్రీ ! పుణ్యవతీ ! ఇటురమ్ము ....

(ఒకరి నొకరు కౌగిలించుకొని మూర్ఛిల్లుదురు.)

లక్ష్మణ: అహో! మా పదినెగారు. ఆమెను పృథ్వీభాగీరథు లిద్దరును ఆదరించినారు.

రామ: అబ్బా! లక్ష్మృత్యము దుర్భరముఃఖమయంగా ఉన్నది.

భాగీరథి: అహో! క్షమారాశి ఈ భూతధాత్రి. ఆమెకూడా వ్యథతో బాధ పడుచున్నది; కాదు—అపత్యస్నేహమే జయించినది. అవును. చేతన జాతమునకెల్ల సర్వసాధారణమే ఈమోహగ్రంథి. అంతర్నాడులతో పెనగొన్న సంతాన తంతువు త్రెంపరాని దనుట నిజము. పట్టీ! వైదేహీ! దేవీ! ధాత్రీ! మీరు ఆశ్వాసింప నగును.

పృథివి: దేవీ! సీతను కన్నందుకు ఏమి సంతోషపడితిని.

(ఇంచుక తెలివితో) ఈ సీతను ఇట్లు చూచుచు - ఊఱడిల్లుటెట్లు?

చిరము దైత్యులనడుమ గాసిలుట మొదల,
పతిపరిత్యాగ పరిభవాపత్తి పిదప;
విధివిపాకాభి ముఖమగు వేళ దాని
ద్వారములు మూసిపెట్టనేర్పారి కగును.

పృథివి: భగవతీ! భాగీరథీ! ఈ లాటిప్రవర్తన మంతయును రామునకు యుక్తమే యందువా!

బాల్యమందున బాలికా పాణిపీడ
నప్రమాణంబు తలపడు - నన్నుగాని-
జనకునేని - మహాగ్నినయిన కనండు,
శీల సంతానముల మాట చెప్పనేల?

సీత: హా! ఆర్యపుత్రుడు నా స్మృతికి వచ్చుచున్నాడు.

పృథివి : ఆ - పుత్రీ ! ఇంకనూ నీకు ఆర్యపుత్రు డెవడు ....

సీత : (లజ్జాబాష్పములతో) మాయమ్మ పలికినట్లే ....

రామ : తల్లీ ! ధాత్రీ ! నీవన్నట్లే. అట్టివాడనే అయితిని నేను.

భాగీరథి : భగవతీ ! వసుంధరా ! క్షమింపుము. లోక సంసారమునకు నీవే శరీరముగదా ! అట్లయ్యును ఎఱుకలేనిదానివలె అల్లునిపై ఎందు కిట్లు ఆగ్రహింతువు ....

క్రమ్మెగా లోకమునెల్ల దుర్యశము ఘోరంబై, విశుద్ధి క్రియన్
నమ్మగాలేదు జనంబు దూరమగుటన్ లంకాపురం - బాత్మ ధ
ర్మమ్మిక్ష్వాకులకున్ సమస్త జనసంధాప్యక్రమం - బా అగ
మ్యమ్మైనట్టి యవస్థ నత్స యెటు మీమాంసించు నాగాములన్.

లక్ష్మణ : ప్రాణిలోకములో జరుగు సత్యము దేవతలకు అచ్ఛముగా తేట పడును. అందుచే భాగీరథి విశేషజ్ఞురాలు ! దేవీ ! నీకు అంజలిపట్టి ప్రణమిల్లుచున్నాను.

రామ : తల్లీ ! మాది భగీరథ కుటుంబమని మఱచిపోలేదు. నీవాత్సల్య ప్రసాదమును పంచిపెట్టితివి ....

పృథివి : దేవీ ! నేనెల్లప్పుడును మీదాననే. జనను - గర్భశోకముదుస్సహా ఖేదకంగా - ఆవేగంతో తాకింది. కాని ఎఱుగనా నేను రామభద్రునికి సీత యెడలగల స్నేహము.

దగ్ధహృదయముతో మత్సుతా త్యాగమునకు
వైపడబోవన నొప్పియున్ - జీవములను
తాల్చి నితడు లోకోత్తర ధైర్యమునను -
తన ప్రజల పుణ్యబలమునన్ - ధరణియందు.

రామ : గురుజనము ఎల్లప్పుడును తమ గర్భరూప కులముపట్ల కరుణా వీక్షణ పరులుగదా.

సీత : (ఏడ్చుచు చేతులు పిసికికొనుచు) నన్ను మఱల నీలో లయము చేసికొనుము.

రామ : ఇంతకన్న మచేమి చెప్పగలదు ...

భాగీరథి : అమంగళమంతరించు గాక – విలయములేక వేయేండ్లు విలసిల్లుము.

పృథివి : పుత్రీ ! నీకు పుత్రులున్నారు. వారిని జాగ్రత్తగా సాకి, సంరక్షింపుము.

సీత : అనాథనైతిని నేను. ఇకనాకేల ఈ పాపము ?

రామ : హృదయమా ! నీవు శిలవుగదా !

భాగీరథి : నీవు సనాథవే. అనాథ వెట్లగుదువు.

సీత : ఈమందభాగ్యురాలికి సనాథత్వ మెక్కడ ?

దేవతలిద్దఱు :

భువనత్రయ మంగళ సం
గవు నిందించుకొననేమి కారణ మిట్టుల్.
భవదీయ సంగతిని మా
పవిత్రతయు పరిమళించి భాసించెనుగా !

లక్ష్మ : ఆర్య ! ఆలకింపుము....

రామ : లోకము – ఆలకించునుగాక (ఆలకింపనిమ్ము)

(నేపథ్యమున కలకలము.)

రామ : మిక్కిలి అద్భుతముగా నున్నది. ఇదియేమై యుండును.

సీత : ఏమిదీ! అంతరిక్షమంతయును అతిప్రజ్జ్వలమానమై - కలకలము పిక్కటిల్లినది.

దేవతలు : ఓహో! తెలిసినది.

అల కృశాశ్వుడు - కౌశికు డవల రామ
భద్రుడందుచు సురపరంపరగ వేని
కా మహాశస్త్రములు విధాయకము గాగ
ఇవె యవతరించెడి - సమంత్ర జృంభకములు.

(నేపథ్యమున)

దేవికి సీతకు ప్రణతులు
సీ వత్సలు మాకు నయిరి నిత్య శరణ్యుల్
కావించెను దత్తము రఘు
దేవుడు చిత్రావలోక దీక్షా పేక్షన్.

సీత : ఎంత అదృష్టమో! అస్త్రదేవతలు ఆవిష్కరించుచున్నారు.

లక్ష్మణ : ఆర్య! ఆర్యతో మీరు చెప్పియుంటిరి. "సర్వథా ఈ యస్త్రములు నీపుత్రుల నాశ్రయించు"నని.

దేవతలు : పరమాస్త్రంబులకు నమ
స్కరణములు - పరిగ్రహణము కథనగా మేముగా
చరితార్థుల - మీవత్సలు
స్మరియింపగ రండు - మీకు మంగళములగున్.

రామ : విస్మయానంద సందర్భ వికల శకల
రభస మయిన నాదుఃఖ తరంగ భంగి
నెట్టుచున్నది పూర్తిగా నిట్టు లిపుడు
కానరానట్టి సంక్లిష్ట గహన దశకు.

దేవతలు: నందినీ! ఆనందింపుము. ఈమహాస్త్రములకు ఆధారులగు నట్టి నీపుత్రులు రఘునందనతుల్యులైరి.

సీత: మాతలారా! ఈ బిడ్డల కెవరు క్షత్రియోచిత విద్య లుపదేశించి అధికారులను చేయువారెవరు?

రాము: అనఘముగ వశిష్ఠుడు నడి
పిన రఘుకుల విధులకెల్ల వెన్నెలయగు నం
దిని సీత; ఆమె సుతులను
వినీతులను చేయ గురువు ప్రాప్తింప దహో!

భాగీరథి: పట్టీ! ఎందుకు నీకీ వృథా చింత. పాలువిడిచిన పిమ్మట ఈ శిశువులను భగవాన్ వాల్మీకికి అప్పగింతును. ఆయన వీరిని క్షత్ర కృత్యములలో తీర్చి దిద్దును. అమ్మా!

ఎటులాంగిరస వశిష్ఠులో
అటులనె ప్రాచేతసఋషి అగును సదం డీ
స్ఫుటయశులు - జనక రఘుకుల
పటిష్ఠుల కుభయులకు - నిజవాత్సల్య రతిన్.

రామ: భగవతి బాగుగా ఆలోచించినది.

లక్ష్మణ: ఆర్య! సత్యముగా చెప్పుచున్నాను. అయా నిమిత్తముల వలన ఈ వత్సలు మన కుశలవులని అనుమానించు చున్నాను. ఏమనగా -

జన్మతో ప్రాప్తమయిన అస్త్రములు - మౌని
సత్తముండు వాల్మీకి ఆచార్యకంబు-
రూపలక్షణములును ఆర్యునివి - ఇంక
వయసుకూడ పన్నెండేండ్లు - వారలేదు.

రామ : వత్సా ! అట్లే నేనును వీరే వారని ఊగిసలాడుచున్న హృదయముతో ముదితుడ నగుచున్నాను.

పృథివి : బిడ్డా ! రమ్ము. ఇక రసాతలము పూతము చేతువు గాక.

రామ : హా ప్రియా ! లోకాంతరమునకు పోవు చున్నావా !

సీత : అమ్మా ! నన్ను నీలోకలిపికొనుము. బ్రతికియుండి ఇట్టి లోకాంతర పరివర్తనమునకు ఓపలేను. నాకు సమర్థత చాలదు.

రామ : తల్లి దీనికేమి చెప్పునో....

పృథివి : బిడ్డా ! పాలు విడుచువఱకును నివు నా నియోగమున ఈ శిశువులను పెంచుము. తరువాత - నీయిచ్ఛవచ్చినట్లు చేయవచ్చును.

భాగీరథి : ఇదే - కర్తవ్యము.

(అంతట పృథ్వీగంగలు. వత్సలతో నిష్క్రమింతురు)

రామ : ఏమీ ! అట్లే నిశ్చితమా ! హా ! దండకారణ్య ప్రియసఖీ ! చారిత్ర దేవతా ! లోకాంతరములో వసింప నేగితివా - (మూర్ఛిల్లును)

లక్ష్మణ : హే భగవన్ ! వాల్మీకీ ! రక్షింపుము. రక్షింపుము. నీకావ్యార్థమిదియా ?

(నేపథ్యమున)

నృత్తగీత వాద్యములను అవల పెట్టుడు. ఓహో ! స్థావర జంగమములారా ! ప్రాణధారులారా ! మానవులారా ! అన్యజీవులారా ! ఇది చూడుడు. మహర్షి వాల్మీకి అనుజ్ఞచే సంధానమయి పవిత్రమైన ఆశ్చర్యమును....

లక్ష్మణ : (పరికించి చూచి)

గంగజలంబు గుబ్బటిలు కవ్వముతో మథియించినట్టులన్,
నింగియు నంతరిక్షమును నిండెను దేవఋషీంద్ర బృందముల్.

మంగళదేవతన్ బలె జలంబుల వెల్వడివచ్చె దేవియే.
గంగయు ధాత్రియున్ నగు మొగంబుల పార్శ్వములందుతోడురాన్.

(మఱల నేపథ్యమున)

త్రిభువనారాధితారుంధతీపవిత్రి !
కొలిచెదము మహీభాగీరథులము మేము.
సేచుకోవలెన్ - పుణ్యపునీత - సీత
చేకానుకు సమర్పింప తెచ్చితిమి భక్తి.

లక్ష్మ : ఆశ్చర్యమ్ - ఆశ్చర్యమ్ ! ఆర్యా ! ఇటు చూడండి. (లక్షించి)
అయ్యో ! ఆర్యున కింకను ఉచ్ఛ్వాసమాడుట లేదు.

(అంతట అరుంధతి సీతతో ప్రవేశము)

అరుంధతి: త్వరపడుము బిడ్డ ! వైదేహి ! తావక స్వ
భావమైన శాలీన సాధ్వసము వదలి
రమ్ము. బ్రదికింపు మావత్స రామభద్రు
నీదు పాణిప్రియ స్పర్శనాదరమున.

సీత : (సంభ్రమముతో రాముని స్పృశించు చున్నది) ఆర్యపుత్ర !
ఊరడిల్లుము - రెమ్ము.

రామ : (మూర్ఛతేఱి - ఆనందముతో) ఓహో ! ఏమి యీ విశేషము.
(చూచి - అద్భుత హర్షములతో) అహో ! దేవి - జానకి (లజ్జతో)
ఎట్లూ ! అంబ - అరుంధతి - మఱి-ఋశ్యశృంగాశ్రమమునుండి పెద్ద
లందఱునూ శాంతాసమేతముగా తిరిగి వచ్చినట్లున్న దే.

అరుంధతి : వత్సా ! ఈమె భగవతి భాగీరథి. మీరాఘువులకు కులదేవత.
నీయెడ సుప్రసన్నురాలు.

(నేపథ్యమున)

జగత్పతీ! రామభద్ర! చిత్రదర్శనకాలమందు నన్ను సంభావించి ఇట్లు పలికితివి.

"అరుంధతి తనకోడలియందువలె నీవును నీపుత్రిపట్ల మంగళధ్యాన వగుము." ఆ పలుకులు స్మరించుకొనుము. ఆఋణమును తీర్చు కొంటిని.

అరుంధతి : బాలకా! ఈమె నీయత్తగారు విశ్వంభరాదేవి.

(మఱల నేపథ్యమున)

ముందు నాబిడ్డను పరిత్యజించు నప్పుడు చిరంజీవి రాముడు ఇట్లు నుడివెను. "భగవతీ! వసుంధరా! శ్లాఘనీయ! నీకూతురు — జానకి యీమెను కాపాడుము" అని. బాలుడూ ప్రభుష్ణూ - అయిన రామ భద్రుడు నాడు కోరినట్లు చేసితిని....

రామ : ఇది ఎట్లో ఊహింపలేను. మహాపరాధము లాచరించిన నాపట్ల ఈదేవతలిరువురును అనుకంపవహించుచున్నారు. (నమస్కరించును)

అరుంధతి : ఓయీ! పౌరజానపదులారా! భగవతీ మతల్లులు-జాహ్నవీ వసుంధరలు ప్రశంసించు చున్నారు. సమర్పించుచున్నాను నేను అరుంధతిని - ఇంతకుపూర్వమే దేవుడు వైశ్వానరుడు పుణ్యచారిత్ర యని నిర్ణయించి యున్నాడు బ్రహ్మప్రముఖులు దేవతలు సంస్తు తించిరి. ఈమె సవితృకులీనుల ఇంటి పెద్దకోడలు. దేవతల యజ్ఞము ఈమెకు పుట్టిల్లు - సీత - ఈమెను రామభద్రుడు దేవిగా పరిగ్రహింప వలెను. మీ రందఱును ఈ విషయమున ఏమందురు!

లక్ష్మణ : ఆర్య! ఇట్లు దేవి అరుంధతి కసరికొని పలుకగా - పౌరులు- జానపదులు - శేషించిన యావజ్జీవ గ్రామమును - ఆర్యకు - సీతకు

నమస్కరించుచున్నారు. ఎనిమిదిమంది దిక్పాలకులును - ఏడుగురు మహర్షులును పూలవాన కురియుచున్నారు.

అరుంధతి : జగత్పతీ ! రామభద్ర !

క్రతువున హిరణ్మయప్రతి
కృతికిన్ ప్రకృతియగు ప్రియసఖి, నఖిలపుణ్య
వ్రతను యథా ధర్మముగా
ప్రతిష్ఠిత మొనర్పుము రఘువంశ శ్లోకీ !

సీత : ఆర్యపుత్రుడు నాదుఃఖమును తుడిచివేయునని ఎఱుగుదును.

రామ : భగవతి—అరుంధతి—ఆదేశించినట్లే....

లక్ష్మ : కృతార్థుడనైనాను.

సీత : జీవములు వచ్చినవి మరల ....

లక్ష్మ : దేవీ - లజ్జింపక లక్ష్మణుడు ప్రణమిల్లుచున్నాడు.

సీత : వత్సా ! ఇట్లే చిరంజీవి వగుము.

అరుంధతి : హే ! భగవన్ - వాల్మీకీ ! సీతా గర్భసంభవులగు కుశలవు లను రామభద్రున కందింపుము.

(అరుంధతి నిష్క్రమించును)

రామ, లక్ష్మ : అంతకంటె సంతోషమా !

సీత : నాబిడ్డలెక్కడ !

(వాల్మీకి కుశలవులతో ప్రవేశించును.)

వాల్మీకి : బాలకులారా ! కుశలవులారా ! ఈయన మీతండ్రి రఘుపతి- ఇతడు లక్ష్మణుడు మీ పినతండ్రి. ఈమె - సీత. మీతల్లి-ఈరాజర్షి జనకుడు మీకు మాతామహుడు.

సీత : (హర్ష - ఉత్సుకయై చూచి) నాతండ్రి యేడీ ! నాకన్న బిడ్డ లెక్కడ ?

కుశలవులు : ఓహో ! మా నాయనగారు - మాయమ్మ - మాతాతగారు.

రామ : (సంతోషముతో వారిని కౌగిలించుకొని) చిరంజీవీ! కుశా! లవా! మా పుణ్యములు పండినవి. మిమ్ముపొందుభాగ్య మింతకాలమునకు అబ్బినది మాకు.

సీత : రమ్ము - వత్సా ! కుశా ! రా - చిన్నవాడా లవా ! పునర్జన్మతో నున్న నన్ను - మీయమ్మను. ఇద్దరునూకలిసి - శీఘ్రముగాకౌగిలింపుడు.

కుశలవులు : (అట్లే తల్లిని కౌగిలించుకొని) ధన్యుల మయినాము మమ్మా !

సీత : భగవాన్ : ప్రణమిల్లుచున్నాను.

వాల్మీకి : బిడ్డా ! నీవిట్లే చిరవర్ధ ని వగుదువు గాక.

సీత : ఆహో ! ప్రేమ పరాయణుడు. మా నాయనగారు. కుల గురువులు - వాత్సల్య మూర్తులు పెద్దలు. సభర్తృక. సాధ్వి శాంత- అందఱును ఇక్కడనే ఉన్నారు. ఆర్యపుత్రుడు కుశలవులతో కూడ దర్శనీయుడు అహో పరిమితి లేని ఈ యానందములో పరవశనగు చున్నాను.

(నేపథ్యమున కలకలము)

వాల్మీకి : (లేచి - పరికించి) ఓ ! ఇదియా ! లవణాసురుని లంఘించి లాగివేసిన మధురాధీశ్వరుడు వచ్చినాడు.

లక్ష్మ : ఔను. మంగళ సంసర్గ మెప్పుడునూ - ఒంటరిగా రాదు.

రామ : ఆయానంద మంతయూ అనుభవించు చున్నాను. అయినను నమ్మ లేకున్నాను. కాదు. లోకములో అభ్యుదయ స్వభావమే ఇట్లుండును.

వాల్మీకి : రామభద్ర ! ఇంతకంటెనూ నీకు ఏమి ప్రియమో అడుగుము దానిని ఇత్తును.

రామ : ఇంతకంటెను ప్రియమింకొకటి ఉండునా ! అయినను ఇట్లగును గాక.

(భరత వాక్యము)

మాతవలె బోరెను గంగవలెన జగన్మంగల్యమై, రమ్యమై
ప్రీతిశ్రేయము లిచ్చి పాపముల బారిగా తేర్చు వాల్మీకి వా
గ్రైతిహ్యంబిది రూపకాభినయశయ్యా చాసిలెగా: శబ్దసం
వేత బ్రహ్మ మెఱుంగు ధీర కవిసూక్తిగా చూడనా కోవిదుల్.

సంమోళనమను సప్తమాంకము.

స్వస్తి.

# ఏహాతపత్రేఖము

(మహాకవి మేఘమాతకు తెనుగు)

సఖుడా! ఇంచుక జాలి నాతపకటి నీలాంశువేలంబు నే తనశాఖాకర మూడి పట్టుకొన, దానిఁ బట్టి పైవోర్చి, పై బడి వేర్లాడుచున్న నీపయనమెట్లో సాగు! భోగం బెఱి- గిన వాడెప్పు డనావృతాంబరనితంబఁ వీడి పోనోపునో!

